నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050015398

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in



# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

“దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం” అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన ‘ఇచ్ఛ’ (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. “నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది” అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీకోదండరామచంద్రాయనమః.



# వరదరాజశతకము.

వల్లివేడు కాదాటి

గుండ్లపల్లి

## నరసమ్మగారిచే

రచియింపఁబడి

మ-రా-రా-శ్రీ, కట్టమంచి రామలింగారెడ్డిగారి

పీఠికతో


చిత్తూరు విక్టోరియా జూబిలీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

రెండవకూర్పు.

1931

# పీఠిక.

ఈ గ్రంథమును రచించిన ఆమె చిత్తూరికి కొంతదూరమునందు గుండ్లపల్లె అను గ్రామములో నివసించు నరసమ్మగారు. ఆమె నాకు అక్కవరుస. మా వంశములో ఈ మహాత్మురాలికన్న మించిన రూపవతిగాని గుణవతిగాని అవతరించి యుండలేదని నానమ్మకము. జీవితమొక్కటి సుఖభాజనము కాకపోయినదిగాని, యింకేకొదవయు చెందినవారుకారు. సుఖమనఁగా తనయొక్క సుఖము. గొప్పవారికి శోకమేగదా ఈ కలికాలములో భగవంతుడిచ్చెడు శుల్కము. చిన్ననాటనే భర్తకాలగోచరుడయ్యెను. అతనిపేరు అప్పాసామిరెడ్డి. వారి గ్రామము నల్ళివేడు. వారి తమ్ములైన శ్రీ నారసింహారెడ్డిగారు చిత్తూరు జిల్లాలోని అగ్రగణ్యులలో నొకరు. ధనియనియు దానియనియు సమప్రసిద్ధి వడసినవారు. రెడ్డిజన సంఘమునకు ఇరువదివేల రూప్యముల నిచ్చిరి వారు నా యక్కయైన సుందరమ్మగారి భర్త. ఇట్లు సర్వవిధముల నాకు అత్యంత సమీప బంధువులైనందున నా పసితనమునుండియు నేను ఈ కర్త్రిణిని చక్కగా నెరుగుదును. ఆ యమ్మను దర్శించిన చాలును; పూజించుట తప్పదు; ప్రేమించుట అంతకుముందే తప్పదు.

మాయింటిలో పూర్వము మేనమామలయిండ్లకు బాలురమైన మేము ఏటేట పోవుట పద్ధతిగానుండెను. ప్రతిసంవ

త్సరమును అరగుండ వావిల్‌తోట, దామల్ చెరువు, ఎల్లంపల్లె, వళ్ళివేడు, గుండ్లపల్లె ఒకచుట్టు వేసికొని వచ్చుచుంటిని. పోయినప్పుడెల్ల పట్టంచు పంచెలు, ఒక్కరూపాయి నాకు మామూలు సంభావన. ఇంక విందులసంగతి చెప్పబనిలేదు. కోళ్ళు, పొట్టేళ్ళు, గడ్డపెరుగు, ఇంటకాచిన నెయ్యి, ఇత్యాది నైవేద్యములు ఈబాల రామలింగనికి యథేష్టముగ దొరకు చుండెను. కాలము మారినది; మేలుపడినదికాదు. ఆ సుఖ ములు, సాంగత్యములు ఇప్పుడు స్మరణమాత్రములైనవి; ఇం క అనుభవమునకు రాజాలవు.

గుండ్లపల్లెకు ప్రయాణమనగా, అదియొక పండుగ; తీర్థయాత్రయనియు జెప్పవచ్చును. మా "అమ్మాయమ్మ"- నరసమ్మగారియొక్క ముద్దుపేరు. మాకుభోజనముపెట్టుటతో తృప్తిజెందువారుకారు. ఆమె నడతలు పలుకులు మనస్సు ను వికసింపజేయునవి. మఱియు—ఇదియ అనన్య సామా న్యమైన విందు—ఊకుడుకథలు చెప్పుటలో మిక్కిలి నేర్పరి. శ్రాద్ధస్తమానముకు, ఆపెను వంటయింటికి పోనియకుండ కథ లు చెప్పుమని నిర్బంధపఱచుచుండెడివాడను. రాత్రులలో ఆపెవద్దనే పరుండి నిద్రవచ్చువఱకు కథలు చెప్పుమని విను చుంటిని. ఆపెవద్ద నేర్చుకొన్నవి నాకు అవయస్సున, 10, 12 సంవత్సరములపుడు, నూరు కథలకైన నెక్కువ వచ్చి యుండెను! నూరుకథలవాడనని మావారందఱు నన్ను మెచ్చుకొనుచుండిరి; నేనును ఈవిషయములో అహంభావ ము లేనివాడనుగానండి యుండలేదు! బాల్యము అహం

భావ ప్రధానమైన వయస్సుగదా! ఇప్పుడు ఆకథలన్నియు మఱపునకు వచ్చినవి; జ్ఞప్తికి వచ్చునవికావు! నాయొక్క స్మృతిమాంద్యము తలచుకొన్న నాకే సిగ్గుగుచున్నది. మా "అమ్మాయమ్మ"గారు ఎవ్వియు మఱచినట్లు కానము. కారణమేమనఁగా తరతరములుగా నితరులబిడ్డలను ఆదరించి పోషించుచు కథల చెప్పుచుండుటనుగాన. పరులకు నిర్భేదబుద్ధితో మేలుచేయుచుండుదుమేని, మనయొక్క ఆత్మయు నిత్యశక్తిని, నిరంతర వికాసమును దాల్చినదిగా నుండుటకు నిదియొక నిదర్శనముగదా.

మా నరసమ్మగారికి వైధవ్యదుఃఖము కొంతకు కొంత తీఱునను ఉద్దేశ్యముచే ఆమె అన్నయైన నరసింహారెడ్డి ఆమెకు తనవల్లనైనంత కొలది విద్య చెప్పించెను. విద్యతోడ చీట్లు ఆడుటయు చెప్పించెను! కాలహరణమునకు నలయు సామగ్రుల కలిగియుండుటయేకద చింతాపనోదనక్రియ. అయినను ఈమెకు వచ్చిన విద్య గురులయొక్కగాని పరులయొక్కగాని భిక్షగాదు. అది సహజ పాండిత్యమునకుఁ జేరిన వరప్రసాదము. 13, 14 సంవత్సరములకంతయు నాతండ్రిగారైన శ్రీ కట్టమంచి సుబ్రహ్మణ్యారెడ్డి ప్రీతిప్రసాదముచేత తెనుఁగులో నేనును భారత, భాగవతముల ఇంచుమించుగ అర్థజ్ఞానముతో చదువునంతటివాడనైతిని. గుండ్లపల్లెకు పోయినప్పుడెల్ల నన్ను భారతమును చదువుమని అమ్మాయమ్మగారు వినుచుందురు. పద్యముల కర్థము చెప్పమందురు. శంకలేక తప్పో

ఒప్పో యేదేనొక వ్యాఖ్యానముచేసి నాపాండిత్యమును నిలుపుకొనుచుంటిని ! పూర్వము ఆమె నాకు ఊకుడుకథలుచెప్పి జ్ఞాపకశక్తిని, భావనాశక్తిని వృద్ధిపఱచెను. ఇప్పుడు ఆమెకు కలిగిన ప్రతి ఫలము భారత శ్రవణము.

ఆవయస్సుననే ఆమెయందున్న గొప్పశక్తియొకటి నాకు గోచరమయ్యెను. కవిత్వమునకు ప్రధానబీజములలో చెవి యొక్కటి! కంటితోఁచూచి చూచి, గణములను, యతులను, ప్రాసములను పరీక్షించుకొనుచు, పద్యములను వ్రాయునట్టి మూఢులు తెలుచుగాలేరు. కాంబోలు. పద్యమును చదువునప్పుడును, భావములోతీక్ష్ణనప్పుడును, శబ్దమునుబట్టియే అదిసరిగానున్నదా లేదా యనుట, కవిత్వశక్తిగలవారి కెల్లను అప్రయత్నముగఁ దోఁచును. ఆ కర్ణ ప్రభావము మా నరసమ్మగారికి వెన్నతోఁవచ్చినగుణముఁ అట్లగుట పద్యముల ధోరణి, శయ్య, గణయతి ప్రాస సరళి, మొదలగు పద్యలక్షణములను చెవిచేతనే గ్రహించినది. నాకుఁ దెలిసి ఆమె చందశ్శాస్త్రము చదువలేదు. వ్యాకరణమును చదువలేదు. ఆశుమ్మ పఠనమును నేను కొంతవరకు చేసియున్నాను. మా [illegible]కు ఆదార్శ్యాగ్యము సంభవించినట్లు కానము.

కవిత్వమునకు జీవకళ భావము. పద్యము శరీరమాత్ర మట్టిది. ఇట్టి యుదారచిత్తురాలికి భావములు తక్కువగా నుండునా ;

చింతాపూరితమైన జీవితముగాన పరమేశ్వరుఁడే తప్ప

ఇంకెవ్వడు నాకు దిక్కు అను దీనత్వముతోడ భక్తియు పెరుగుట యేమి యాశ్చర్యము! ఈ గ్రంథముయొక్క ఆధారభావము భక్తి. అందులోను అకృత్రిమ స్వభావము వహించెడు సహజమైనభక్తి. పాండిత్యము, తత్త్వపరిశోధనము, వేద వేదాంత విచారము మొదలగు కారణములచేత కొందఱికి తటస్థించెడు జ్ఞానవాదము కాదు. మఱి మిరాబాయి, సక్కూబాయి, ఘోరాం కుంభార్ మొదలగువారిచే ప్రకటింపఁబడిన హృదయముయొక్క ఆవేశము.

తన దుఃఖమును తానెట్లు ఆడంబరములేక చిన్ననిసూటి మాటలచే వ్యక్తపఱచెడునో చూడుఁడు:—

సీ॥ జయ రామ నేభువిఁ జన్మమెత్తినదాది
తల్లిదండ్రులఁ బాసి తల్లడిలితిఁ।
బతితపావన బాల ప్రాయంబునందునేఁ
బతినిఁగోల్పడిచాలఁ బాటుపడితి।
సమరవందితనిన్ను నర్చించనేరక
యన్నలబాసినే నధమనైతి।
నిన్నియునెడఁబాసి నిన్ను నేమఱవక
ధైర్యంబుతోనుండి ధన్యనైతి।
నెన్నికష్టంబులుండిన నెపుడుమిమ్ముఁ
దలచువారలపాపముల్ తొలఁగుటబదె! ॥పుడమి॥

భక్తులు సొంతగాండ్రరీతి భగవంతునితో వాగాడి

తిరస్కరింతురుగదా. చిన్నబిడ్డలు తల్లిదండ్రుల ముద్దుమాట లుగా గద్దించు మాడ్కి, ఈముగ్ధభక్తి (మూఢభక్తి కాదు సుమా!) ఎంతసొంపుగా నున్నదో 24 వ పద్యమున తెలియ నగును.

సీ॥ పక్షివాహన! లక్ష్మి వక్షమందుండగ
బిక్షమెత్తితివేల బిడియపడక|
పాలసంద్రపువెన్నఁ బంచిపెట్టుచునాఁడు
స్త్రీరూపమెత్తితి సిగ్గుపడక।
ధరజీవతతిఁబ్రోచు దొరవయ్యునడవుల
గోవులఁగాచితి కొంచెపడక|
గొల్లనెలంతల యిల్లిల్లుతిరుగుచు
వెన్నమెక్కితిక దా వెలితియనక।
యిట్టికారానివగుపనులిందిరేశ
యెటులొనరించినావహో! యెగ్గులేక ॥పుడమి॥

పెండ్లికార్యములలో 'తలుపులు తీసేపాటలు'ను ఈసరస వివాదములకు నిదర్శనములు. ప్రణయకలహములును ఈ తర గతికి జేరనవియ. భగవంతునితో ప్రణయ కలహములుపెట్టు కొని ఆదరపరిహాస వాక్యముల ప్రయోగించుట భక్తులకుచేరి న హక్కులలోనొక్కటి.

ఈశతకములో నీతిపద్యములున్నవి; దశావతార వర్ణ నములున్నవి; రామాయణ భాగవతా కథాసంగ్రహములు

న్నవి; భారతము (నాకు ప్రాణపదమైన గ్రంథము) యొక్క సురభిశీతల పవనము వ్యాపింపకపోలేదు. హిందూస్త్రీలకు ప్రాణములకన్న నెక్కువయైన పాతివ్రత్యాది సాంసారిక ధర్మములున్నవి, జ్ఞానమార్గ పద్యములున్నవి. ఇంక భక్తిమార్గ పద్యముల దడవపని లేదు.

తెనుగుదేశములో భక్తులకు ఎత్తివచ్చిన గ్రంథము భాగవతము. విషయము వారికి ఇంపైనది. శైలియన్న దాసరి వారి ఘంటానాదము పోలె లింగు లింగనియుండునేమో! ఎట్లును భాగవతముయొక్క శైలిని అనుక్రమించుట అంతకష్టము కాదు. "అంత" అనుట ఏలనగా భారతముయొక్క శైలితో పోల్చినయెడలనని. దీనికి నిదర్శనముగాను, తన స్వకీయ చరిత్ర సంబంధిగాను ఉండు రెండు పద్యముల ఉదాహరించుచున్నాను.

"మందారమకరంద మధుమానెడి తేటి చేరునేయుమ్మెత్తచెట్లకడకు".

సీ॥ అత్తమామలమాట కడ్డమాడని కాంత
కాంతయేరతనాల దొంతిగాని।
బావమఱఁదులకు బదులుపల్కని బాల
బాలయేయదివిరిగోలగాని।
పతిసేవకెన్నండు బ్రాలుమాలనియింతి
యింతియేయదిపూల బంతిగాని।

పతిబంధువునఁ బ్రేమ భావించెదునతివ
యతివయేయపరంజి ప్రతిమగాని।
యిట్టిసద్బుద్ధిగలిగిన యింతితోడఁ
గూడుకొన్నట్టిపతికి వైకుంఠమదియె ॥ఘ్రుడము॥

సీ॥ తల్లిదండ్రులమాటఁ దగవినకుండినఁ
గూఁతురేయదివెట్టికోఁతిగాక।
అన్నదమ్ములతోడ నైకమత్యములేని
కూఁతురేయదివెట్టికోఁతిగాక।
మాటకుమాటాడి మంకుచేష్టలుచేయు
కూఁతురేయదివెట్టికోఁతిగాక।
కనుసన్నతోఁబనుల్ గావింపకుండినఁ
గూఁతురేయదివెట్టికోఁతిగాక।
యిట్టికూఁతులనొరులకు నిచ్చితల్లి
యత్తగారిదితప్పని యనఁగనేల! ॥ఘ్రుడము॥

మిక్కిలి జాలిన పుట్టించెదు 23 వ పద్యమును గమనింపుడు.

సీ॥ అవనిలోనావంటి యాఁడుజన్మముకంటె
బండగానడివిలో నుండవచ్చు।
బుడమిలోనావంటి పొలఁతిజన్మముకంటె
గుట్టపైఁజెట్టుగాఁ బుట్టవచ్చు।
వసుధలోనావంటి వనితజన్మముకంటె
వనములోమృగముగాఁ దనరవచ్చు।

క్షితిలోననానాటి యతివజన్మముకంటెఁ
జెట్టుపై పిట్టగాఁ జెలఁగవచ్చు।
నిట్టిసంసారవారాశి నీదుకంటె
నీస్థలంబున గతికర్తమై నెగడవచ్చు ॥పుడమి॥

రెడ్డికులములో పుట్టినవారికి వేమనయొక్క గాలి కొంతయైన తగులకయుండునా?

వారియొక్క బోధతో అన్వయముచెందిన మాటలు కొన్నియున్నవి.

సీ॥ కాశికిఁ బోవఁగాఁ, గర్మంబుదీఱునా
కాశికిఁబోవవే కాకులెపుడు।
జలములఁ గ్రుంక, శాంజాలునా మోక్షంబు
జలములనుండవే జలచరములు।
తపముచేఁదనువును దపియింపఫలమౌనె?
తలక్రిందుగ్రేలవే ధరఖగములు।
వనబిలంబులనుండ వశుఁడౌనె దేవుండు?
బిలములందుండవే యెలుకలెపుడు।
ఇట్టికష్టమౌవిద్యల నెల్లవిడిచి
బుద్ధినీయందునిలిపినఁ బొందుముక్తి ॥పుడమి॥

సీ॥ ఒరులపై శత్రుత్వ ముంచకుండినఁజాలు
నుపవాసములునిత్య ముండినట్లు।

పరులమనసునొవ్వఁ బల్కకుండినఁజాలుఁ
జతురత వేదముల్ చదివినట్లు ।
ఇతరులసొమ్మాశ్ర యించకుండినఁజాలు
నోపికతో ధర్మ మొసఁగినట్లు ।
వారువీరనిపర్వు వాఱకుండినఁజాలు
దివ్యతీర్థములకుఁ దిరిగినట్లు ।
చాడిమాటలనొకరి పై సాహసమునఁ
బెట్టకుండినఁ జాల్ గుడుల్ గట్టినట్లు ॥పుడమి॥

ఇట్టి జ్ఞానమార్గమునకు శాస్త్రపఠనకు సంబంధము లేదు. ఇది ప్రతియొక్కఁడు తనంతట తానే చేసికొనజాలు విచారము. "కులము చూడంగనేల సద్గుణముగలుగ" "జ్ఞానులజ్ఞాను లోకలీలఁ బూనియున్న । నేమి ? మహిమవలన పారలెఱుఁగఁబడరె ?" "ఎట్టివారికి నొకనింద పుట్టుచుండు; సకలజన సమ్మతిగనుండ జాలునెవడు ?".

ఇట్టి రచన లనేకములున్నవి. అవియన్నియు సామెతలై జనసామాన్యమునందు వ్యాపించుననుటకు సందేహము లేదు.

ఆంధ్రలోక గురువులలో వేమన మొదటివాడందు మేని, సుమతి రెండవవాడు. "వనితకాభరణంబు పతిభక్తి వెలయుట, ఇంటికాభరణంబు లెనయుసుతులు". ఇత్యాది సుమతియొక్క అనుకరణములును ఉన్నవి.

ఇంతటి మంచిగ్రంథములో స్త్రీల ప్రకృతి చెడ్డదియని సూచించెడు పద్యముండుట నాకు చింతగానున్నది. ఈదోష ము వేమనయందును ఉన్నది; హిందువులయందెల్ల నున్నది; మనజాతి దోషములందెల్ల ఇది మిక్కిలియు అసహ్యమని నా యభిప్రాయము.

సీ॥ వనితలహృదయంబుఁ గనఁజాలక యెగాదె
త్ర్యంబకుండాగంగఁ దలనుదాల్చె ।
కాంతలమర్మముల్ కానరాక యెగాదె
పడఁతివాక్కునునుంచెఁ బద్మభవుఁడు ।
అతివలచిత్తంబు లరయజాలక కాదె
యురమునశ్రీలక్ష్మి నుంచెహరియు ।
నింతులభావంబు నెఱుఁగఁజాలక కాదె
సతినరుంధతి వసిష్ఠమునిగాచె ।
నెంతపతిభక్తిగలిగిన నింతివిభుఁడు
చెంతనుంచుటధర్మంబు సృష్టిలోన ॥పుడమి॥

అయినను స్త్రీలు స్త్రీలను నిందించికొన్న కొదవ లేదు కాఁబోలు. పురుషులైన ఈ సనాతనధర్మమును వద లినమేలు.

ఇంక నేనెక్కువగ ఈశతకమునుగురించి ప్రస్తావింపను. ఇప్పటికే ఈ పీఠిక నేననుకొన్న దానికంటెను దీర్ఘమైనది. మా "అమ్మాయమ్మ"గారి యందలి ప్రీతియు భక్తియు

దీనికి ముఖ్యహేతువులు. ఆయమ్మగారు చెప్పినట్లే దోషము లెవ్వియైన నున్న విబుధులు మన్నింతురుగాక.

నా తమ్ముని భార్య శ్రీ తిరుమలమ్మయు "గురుబోధామృత" మను గ్రంథమును ప్రకటించి మా వంశమునకు కీర్తి దెచ్చినది. మావంశమునకేది వచ్చిన రానిందు; తెనుగుభాష యొక్కటిమాత్రము అక్షయముగ నిలచియుండినఁ జాలును.

చిత్తూరు,
25—12—23.

కట్టమంచి రామలింగారెడ్డి.

# విజ్ఞప్తి

పాఠక మహాశయులారా!

ధర్మార్థ కామ మోక్షముల సాధింప జననీ జనక గురు దైవారాధనమే కర్తవ్యమని మన హిందువులెల్ల రెఱిగిన విషయమే. అందు స్త్రీలకు బాల్యమందునఁ దల్లిదండ్రుల సేవయు నాపైఁ బాతివ్రత్యంబును దైవధ్యానంబును జన్మతారకములు. నాకుఁ బదునొకండవయేటఁ మాతృవియోగమును, బండ్రెండవయేఁట భర్తృవియోగంబును, బదుమూఁడవయేఁట బితృవియోగమును, వాటిల్లె. మాతాపిత భర్తృసేవలు చేసి తరించుభాగ్యము నాకు లభింపదయ్యెను. తరణోపాయము స్ఫురింపదయ్యెను. పైతృకకార్యములఁ బెద్దల సంతృప్తి పఱచుచు దైవధ్యానమునఁ గాలముఁ గడపుటతక్క వేఱు తారకములేదని పెద్దలవలన నెఱిఁగిఁ సద్గ్రంథ కాలక్షేపము సేయుచువచ్చితిని. కాలక్రమమున భాషాపరిచయము కొంతగలుగుటచే నోపినకొలదిఁ భాషాసేవచేసి లోకోపకారంబుగ నొక చిన్నపొత్తము వ్రాయు నభిలాషజనించె. ఈతత్కాల కర్తవ్య మంతకన్న స్ఫురింపకుంటచే భర్తృరూపియగు దైవము పేర నొక్కశతకంబును; భక్తిరసప్రధానంబగు హరికీర్తనలను రచించితి. మత్ప్రయత్నమున నీయది ప్రప్రథమ మగుటచే "ప్రమాదో ధీమతామపి" ధీమంతులకునైనఁ బొరపాటులు

గలుగుననుచో నాబోటియల్ప మతికాతప్పులు లేకపోవుట? విజ్ఞులు నాయజ్ఞతమన్నించి యుండుఁ బొసఁగిన దొసఁగులఁ దెలిపినచోఁ గృతజ్ఞతతో దిద్దికొనియెద.

నేనీగ్రంథమును వ్రాయ నారంభించినకాలమున మాగృహమునకు దయచేసి కొన్ని పద్యములజూచి సంతసించి మిగులఁ బ్రోత్సాహముగలిగించి పూర్తియొనరిందపఁ బీఠికను వ్రాసియిచ్చిన సమీపబంధువును సంస్కృతాంధ్రాంగ్లేయ కర్ణాట భాషావిశారదులును నాసేతు హిమాచల పర్యంత దిగంత విశ్రాంత యశోవిరాజితులునగు శ్రీయుత కట్టమంచి రామలింగారెడ్డిగారికిని, శ్రమకోర్చి శతకమెల్ల సవరించి ముద్రాపణ కార్యంబునను శ్రద్ధవహించి ముద్రాప్రమాదములఁ జక్కఁబఱచిన పాకాల మధ్యము పాఠశాలాంధ్రపండితులును శాంతాభరణ భూషితులును రాక్షస వివాహము, విద్యార్థిశతకము, ఆంధ్రీకృత ప్రశ్నోత్తర రత్నావళ్యాద్యనేక గ్రంథ నిర్మాతలును నగు శ్రీయుత పూతలపట్టు శ్రీరాములరెడ్డిగారికిని దీనినతి శ్రద్ధతోఁ బఠించి నాయందతికారుణ్యముంచి ప్రకటించిన వల్లివేడు గ్రామస్థులును, నామఱఁదిగారును నగు శ్రీయుతులు వి. శి. నరసింహారెడ్డిగారికిని గడుంగడుఁ గృతజ్ఞురాలను.

| | |
|---|---|
| గుండ్లపల్లె, | ఇట్లు, |
| రుధిరోద్గారి, | సుధీజన విధేయురాలు, |
| వై. శు. త్రయోదశి. | వల్లివేడు కాదాటి. నరసమ్మ. |

శ్రీరామజయం.

# ❦ అంకితము ❦

అవ్యయుండాదిపూరుషుఁ ◆ డాదిదేవుఁ
డనఘుఁడమలుఁడనంతుఁడు ◆ సాంకితుండు
నైన కరివరదేశున • కంకితంబు
సలిపితినిదీన జన్మంబు ◆ సఫలతగన ॥

ఎతసిపాద సేవనమునా ◆ కిహపరముల
సౌఖ్యమొదవించునట్టి స ◆ జ్జనవిధేయు
లకునుగీర్తి శేషులకుఁ బ • తికిఁ బ్రపత్తి
నాకు సేవించుభాగ్యంబు • లేకయుంటఁ
గలుగుకన్నీరె శుద్ధోద ◆ కంబుగాఁగ
భర్తృదైవరూపముగుట ◆ భవ్యకీర్త
సములె యతనికర్పించు సు • మములుగాఁగఁ
జేసిపూజించితిని భర్తృ ◆ సేవనంబు
నప్పుసామాన్యాఖ్యవరునకు • నధికభక్తి ॥

పతిపాదతీర్థంబెఁ • భవ్యతీర్థంబు
పతిసేవయే భగ • వత్సేవనంబు
పతిపూజయే భగ ◆ వత్పూజనంబు
పతిభక్తియే భగ • వద్భక్తియెందుఁ

16

పతివ్రతగాని పా • లంతివ్రతమేల ?
బొమ్మకుఁ జేసిన • పూజలుగావె ?
యనిభక్తినప్ప సా • మాన్యాఖ్యవరునకు
మత్ప్రతికర్పింతు • మహితకీర్తనల
భర్తయేదైవ రూ • పంబని తలంచి

ఓం.

శ్రీ కోదండరామచంద్రాయనమః.

# వరదరాజశతకము.

(నరసమాంబీయము.)

సీ॥ శ్రీవరదాఖ్యనిన్ సేవించువారలఁ
బాలించుచుందువు పరమపురుష
కరివరదానిన్ను గాంచియుండెడివారిఁ
గాపాడుచుందువు కరుణతోడ
భక్తరక్షణానిన్ను భజియించువారికి
నశ్వరసుఖమిత్తు నాగశయన
నారదవంద్య నిన్నమ్మియుండెడివారి
నయముగా రక్షింతు నరకవైరి

జగములను నుద్ధరించెడు సరళమతికి
నిన్ని చెప్పంగనేలయ్య యినకులేశ
పుడమి శ్రీవల్లివేడు సత్పురనివాస
వనితనరసాంబఁ బ్రోవుమా వరదరాజ. 1.

సీ॥ వాసుదేవునిఁగాని వర్ణింపనట్లుగా
వాణినాకీయవే వాక్కునెపుడు
నిందిరాధిపుఁగాని యితరంబుఁజెందక
హరుఁడనాకొసఁగవే యాత్మశుద్ధిఁ
బద్మలోచనుఁగాని పఠియింపనట్లుగాఁ
బరమేష్టి పెట్టవే పాఠములను
హరిపాదములఁగాని యన్యంబునొల్లక
లక్ష్మి నేర్పింపవే లక్ష్యములను
పక్షివాహనునీమీఁది పద్యములను
నచ్చుపడఁజేయుమయ్యనా యాత్మనుండి ॥పుడమి॥ 2.

సీ॥ ఆర్యులకెల్లనే నతిభక్తితో మ్రొక్కి
విబుధులకెల్లనే వినుతిచేసి
రామలింగార్యుల రయమొప్పనుతియించి
మునులకుఁ గేల్జంట మోడ్పొనర్చి
వాల్మీకిప్రభృతికి వందనంబులొసంగి
శుకశౌనకులను బ్రస్తుతులనెంచి
వరదరాజకృపను వరకవిత్వమునొంది
శ్రద్ధతో వారినా బుద్ధినుంచి
యిష్టకామ్యార్థసిద్ధికై యింపుమీఱ
భక్తితో నొక్కశతకంబు వ్రాసినాను ॥పుడమి॥ 3.

సీ॥ జయరామ నేభువిఁ జన్మమెత్తినదాది
తల్లిదండ్రులఁ బాసి తల్లడిల్లితిఁ

బతితపావనబాల ప్రాయంబునందునేఁ
బతిసిఁగోల్పడిచాలఁ బాటుపడితి
నమరవందితనిన్ను నర్చింపనేరక
యన్నలబాసినే నధమనైతి
నిన్నియునెడఁబాసి నిన్నునేమఱవక
ధైర్యంబుతోనుండి ధన్యనైతి
నెన్ని కష్టంబులుండిన నెపుడుమిమ్ముఁ
దలఁచువారల పాపముల్ తొలఁగుటరుదె? ॥పుడ॥ 4.

సీ॥ పతితపావన! నన్నుఁబాలించుపాలింపఁ
కరుణాసాగర! నీకు శరణుశరణు
రామచంద్రా! నన్ను రక్షించురక్షింప
దీనపోషక! నీవె దిక్కుదిక్కు
కాకుత్థ్సకుల! నన్ను గరుణించుకరుణింప
జగదీశ్వరా! నీకు జయముజయము
ధర్మపాలన! నీకు దండంబుదండంబు
సురవరార్చిత! నీకు శుభముశుభము
వేవిధంబులనిన్ను నే వినుతిసేతు
నన్నుఁబ్రోవుము మఱవక నలిననాభ ॥పుడమి॥ 5.

సీ॥ నీమోహనాకృతి నీలకంఠుఁడెఱుంగు
లలితసౌందర్యంబు లక్ష్మియెఱుఁగు
నీరాజభుజశక్తి మారీచుఁడెఱుఁగునా
భీలశరపటిమ వాలియెఱుఁగు

ధైర్యశౌర్యంబులు దశకంఠుఁడెఱుఁగును
సత్యవాక్యము విభీషణుఁడెఱుఁగు
నీప్రముచ్చుపనిగొల్ల నెలఁతలెఱుఁగుదురు
నీదంటతనము యశోదయెఱుఁగు
నీమహామహిమముభక్త నివహమెఱుఁగు
నిన్నునెఱుఁగంగ నేనెంత నిర్మలాత్మ ॥పుడమి॥ 6.

సీ॥ మచ్చమైజలధిలోఁ జొచ్చిసోమకుఁద్రుంచి
వేదముల్ బ్రహ్మ కర్పించినావు
కూర్మమైమందర కుధరంబుదాల్చి దే
వతలకునమృతంబుఁ బంచినావు
శ్రీవరాహంబవై యీవసుంధరఁజుట్టి
కొనిపోవుకనకాక్షుఁ గూల్చినావు
స్తంభమందుదయించి డింభకురక్షింపఁ
గాహిరణ్యకశిపుఁ గడపినావు
నీదుభక్తులవైరుల నీరుసేయ
నీవుగాక మఱెవ్వరు నేరరయ్య ॥పుడమి॥ 7.

సీ॥ వటుఁడవై జన్మించి వాసవురక్షింప
బలినిపాతాళమునఁ గెలిచినావు
జమదగ్నిసుతుఁడవై జగతిరాజులఁగొట్టి
జనకాజ్ఞతలఁజంపి మనిపినావు
రఘుకులజుండవై రమణిఁగోల్పోయి రా
వణుఁద్రుంచి సీతతోఁదనరినావు

కృష్ణుఁడవై దుష్టకృత్యంబులను జేయు
చెడుగుకంసునిఁబట్టి చెండినావు
ఇట్టి యవతారములఁ దాల్చి యెంచిచూడ
ధర్మమును నిల్పుటకెకదా ! దనుజవైరి ! ॥పుడమి॥ 8.

సీ॥ కలికిరూపంబున ఖలులగీటడఁగించి
యిల వేంకటేశుఁడై నిలిచినావు
శరరూపమున శంభు కరమునుండి విడువఁ
బడి త్రిపురంబుల నడఁచినావు
వసుధభక్తులుగోరు వరములిచ్చుటకునై
వరదుఁడవను పేరఁ బరఁగినావు
అంబుజోదరసీ మహత్వంబు నెన్నఁగ
నజహరాదులకైన నలవికాదు
అనఁగనేనెంతదానని న్నినుతిసేయ
నన్నుపీడక రక్షించు నాగశయన ॥పుడమి॥ 9.

సీ॥ నవనీతచోరుఁడే నామణిచోరకుఁ
డనువాని మన్న నలందినావు
దుష్టులచేఁజిక్కి ద్రుపదకన్యక వేఁడ
విసువక వలువల నొసఁగినావు
గ్రాహంబుచేఁజిక్కి గజరాజు వేఁడ మ
కరిఁ ద్రుంచి భయమును గడపినావు
పుట్టుగ్రుడ్డికినీవు పొలుపొందఁగనులిచ్చి
విశ్వరూపముఁ జూపి వెలసినావు

ఇట్టివారల కభయంబు లిచ్చినావు
నన్ను రక్షింపవదియేమి? నళిననయన! ॥పుడమి॥ **10.**

సీ॥ ఇక్ష్వాకుకులమున నిరవొందఁగాఁబుట్టి
ధూర్తయౌతాటకఁ దునిమినావు
ఱాతిపై నీపాద రజముట్బిసోఁకించి
మంచిస్త్రీరూపు గావించినావు
ధూర్జటివిలుఁద్రుంచి దుందుభిధ్వనులతో
నిలసుతపాణి గ్రహించినావు
దట్టించినినుఁజుల్క కెట్టింపఁదలఁచిన
పరశురాముని భంగపరచినావు
వచ్చి శ్రీమదయోధ్యలోఁ జొచ్చితండ్రి
మాటఁబాలింపనడవికి మఱలినావు ॥పుడమి॥ **11.**

సీ॥ సౌభ్రాత్రనిధియను జన్ముఁబితృవాక్య
సరణిరాజుగనిల్పి జరిగినావు
వనమునమునుల మన్ననలుగైకొని నిరో
ధువిరాధునవలీలఁ దూల్చినావు
నంపింపవచ్చు శూర్పణఖ ముక్కుసెవుల
వికృతంబుగాఁగఁ గావించినావు
కారణమదిచేసి ఖరదూషణులఁ గూల్చి
పుడమిజాతను గోలుపోయినావు
సఖసిరోయుచు వాలినిజంపి తమ్ము
నేలికపులచేసతివార్త నెఱిఁగినావు॥ ॥పుడమి॥ **12.**

సీ॥ జలనిధిగర్వంబుఁ జక్కఁ-కొనర్చివా
రధిగట్టి మీఁదనీరధిఁదరించి
రావణాదుల సమరంబున సమయించి
జానకిఁగొని విభీషణునినిలిపి
పుష్పవర్షముతోడఁ బుష్పకంబెక్కి-సా
కేతంబునకుఁ జేరి ఖ్యాతిమెఱయ
సీతతో మణిమయ సింహాసనంబున
భరతుఁడు ఛత్రంబుఁబట్టుచుండ
కవలుచామరాల్ వీవఁగాఁ బవనసూనుఁ
డుపచరింప వెలసిన రఘూత్తముఁడవు ॥పుడమి॥ 13.

సీ॥ వసుధలో దేవకీ వసుదేవులకుఁబుట్టి
నీమాయ చేజను ల్నిదురపోవ
నర్ధరాత్రంబున నటమంద కేతెంచి
బాలుఁడైచు యశోదపాలుద్రావి
పూతనప్రాణముల్ పోరిగొనిశకటతృ
ణావర్తులనుగాల నలఁగఁద్రొక్కి-
కాళీయునితిప్పఁ గాళుఁబుంచుచునొక్కి-
త్రొక్కి-తాండవమాడి యుక్కు-చెఱిచి
బకునిఖండించి మద్దుల బలిమిఁగూల్చి
వెలసితౌర! "బాలుండవై" వెన్నదొంగ! ॥పుడమి॥ 14

సీ॥ యాదవవనితలయ్యు మునవారినిస్నాన
మాడంగ వేడుక నచటికేగి

చీరలు ముచ్చిలించి సమీపమునఁబొన్న
చెట్టెక్కి కూర్చొన్న చెలువమైన
నీయూఘనసిగ్గు చేరమణీమణు
లో కృష్ణవలువల నొసఁగుమనిన
గట్టునవిల్చి కేల్గవ పయికెత్తి జో
హారొనర్చిన మీకునబ్బునటంగ
నంత బిత్తరులటు మ్రొక్క నలరికోఁక
లిచ్చివారికె బాసని మెచ్చినావు ॥పుడమి॥ 15.

సీ॥ పక్షివాహన! వల పక్షంబునీకేల?
రక్షించరానన్ను రామచంద్ర!
మునిజనార్చిత! నీకు మోసభావంబేల?
మోక్షంబొసంగరా మోహనాంగ!
కరిరాజవరద! యీ కఠినమానసమేల?
కాచిరక్షించరా కమలనాభ?
పరమాత్మ! యనినిన్ను స్మరణచేయుచునున్న
భక్తురాలినిబ్రోవఁ బాపమటర?
కోపమేలనామీఁదను గోర్కెలొసఁగి
సంతసంబున నన్నేలు సరసిజాక్ష! ॥పుడమి॥ 16.

సీ॥ అదితిసుతుండవై యసురేశుకొంటువై
త్రిభువనంబులఁగొల్చి తివిరినావు
దశరథసుతుఁడవై తాటకఁగసమయించి
గాధేయుసవనంబుఁ గాచినావు!

బ్రహ్మాండమెల్లను బడతిఁయశోదకు
ముఖమునందుఁ జూపుచు మురిసినావు
గోపాలకుండవై గోవర్ధనంబెత్తి
గోపకులభయంబుఁ బాపినావు
ఇట్టి బాలురు భువిలోన నెందుగలరు?
నీవు బాలుఁడవే చూడ! నిగమవేద్య! ॥పుడమి॥ 17.

సీ॥ బ్రహ్మజనకు నెప్డు భజనచేసినఁ జాలు
భవబంధముల నెల్లఁ బాయవచ్చు
విష్ణుసంకీర్తనల్ వినుచునుండినఁ జాలు
నీమణత్రియములు నీఁగవచ్చు
వాసుదేవుని కీర్తి వర్ణించినను జాలు
వాసిగా ధర్మంబు పడయవచ్చు
పురుషోత్తముని పేరు పొగడుచుండినఁ జాలుఁ
బుణ్యస్థలములకుఁ బోవవచ్చు
నిన్ను దలఁచుచు యోగీంద్రులెన్ను మార్గ
ములనుగన్నఁజాల్ నీయందుఁ గలయవచ్చు॥పుడమి॥ 18

సీ॥ వరదరాజా! నిన్ను వర్ణింపనాపూఁట
నిజముగారక్షింప నీదెపూఁట
పురుషోత్తమా! నిన్నుఁ బూజింపనాపూఁట
నిజముగా రక్షింప నీదెపూఁట
భక్తపాలన! నిన్ను భజియింపనాపూఁట
నిజముగారక్షింప నీదెపూఁట

కోదండపాణినిఁ గొనియాడనాపూఁట
నిజముగారక్షింప నీదెపూఁట
నలువతండ్రినిఁ స్తుతియింప నాదుపూఁట
నిజముగానన్నుఁ గడతేర్ప నీదుపూఁట. ॥పుడమి॥ 19

సీ॥ ధీరుఁడాజగదేక వీరుఁడాసత్య
ప్రచారుఁడానిత్య శృంగారమూర్తి
జారుఁడా మన్మథాకారుఁడా నవనీత
చోరుఁడాభక్త మందారకీర్తి
శీలుఁడా యదువంశపాలుఁడా గోపికా
లోలుఁడా శిశుపాలకాలమూర్తి
కాంతుఁడా రుక్మిణీకాంతుఁడా రణశౌర్య
వంతుఁడాలోక ప్రశాంతవర్తి
నమ్మియున్నానునిన్నెపు నందతనయ
ఈవుగాక యితఃపరం బెవ్వఁడింక ॥పుడమి॥ 20.

సీ॥ ఆదివిష్ణుండవై యఖిలంబునిండిన
నికినవతార వరము లేల ?
మణిమయంబగు చిత్రమందిరంబులుగల్గి
క్షీరాబ్ధినుండెడి చింతయేల ?
వాయుసమానమౌ వాహనంబులుగలి
వైనతేయునినెక్కు వాంఛయేల
పట్టెమంచముదిండ్లు పఱుపులుగల్గియుఁ
బన్నగేంద్రునిమీఁదఁ బండుటేల ?

యిట్టిచిత్రంపువర్తన లిందిరేశ
నీకు లీలలుగాఁదోఁచెనే మహాత్మ ? ॥పుడమి॥ 21.

సీ॥ యదుకులోత్తమనీకు నదియేమికార్యమో
సన్నుమఱచితివే నారదనుత
సనకాదియోగుల సన్నిధికేగితో
శౌనకాదులఁజూడ జరిగినావో
మునులరక్షింపంగ వనములకేగితో
యమరులరక్షింప నరిగినావో
నీదాసవరులను నిరతంబుప్రోవక
మఱచుటెందులకయ్య మదనజనక
చదలదాఁగినఁగాని నిన్వోదకినీదు
పదములనునాదుమదిలోనఁ బదిలపఱతు ॥పుడమి॥22.

సీ॥ ఉట్లపైనున్నట్టి చట్లనుబాలకై
కట్టెతోఁదూట్లుగాఁ గొట్టలేద ?
దిట్టరివై నీవు రట్టుసేయఁగఁదల్లి
పట్టిఱోటనునిన్నుఁ గట్టలేద
గట్టుపైనుంచిన దిట్టలఘట్టముల్
దట్టిచెట్టులపైనఁ బెట్టలేద ?
బొట్టెలతోగుట్ట మిట్టలెక్కుచుఁజల్దిఁ
గట్టుకతినలేద పొట్టనిండ ?
యిట్టినీవర్తనములెల్ల రట్టుసేతుఁ
బట్టిప్రోవలేనియశోద పట్టి ! నన్ను ॥పుడమి॥ 23.

సీ॥ పక్షివాహన! లక్ష్మి నక్షమందుండఁగ
భిక్షమెత్తితివేల బిడియపడక
పాలసంద్రపువెన్నఁ బంచి పెట్టినవాఁడు
స్త్రీరూపమెత్తితి సిగ్గుపడక
ధరజీవతతిఁ బ్రోచు దొరవయ్యు నడవుల
గోవులఁ గాచితి కొంచెపడక
గొల్లనెలంతల యిల్లిల్లుతిరుగుచు
వెన్న మెక్కితిగదా వెలితియనక
యిట్టికారానివగుపనులిందిరేశ
యెట్టులొనరించినావహో! యెగ్గులేక ॥ఫ్రడమి॥ 24.

సీ॥ వంచించియసురాళి వలఁ దక్షుమతిసుధఁ
గొంచు దేవతలకే పంచినావు
అనుజుసుభార్యఁ గైకొని నట్టిబలశాలి
వాలిఁ గూలిచితమ్ము నేలినావు
వడుగవై భువిని మూఁడడుగులచేఁ గొల్చి
బలినడంచుచునింద్రు నిలిపినావు
హలధరు వంచించి యనుజఁ బార్థునకిచ్చి
పాండుసంతతివృద్ధి పఱచినావు
ఇట్టిబలియుల వంచించుటెల్ల నిన్ను
దలఁచుభక్తులకొఱకేగదా ముకుంద! ॥ఫ్రడమి॥ 25.

సీ॥ అవనిలోనావంటి యాఁడుజన్మముకంటె
బండగానడవిలో నుండవచ్చుఁ

బుడమిలోనావంటి పాంతజన్మముకంటె
గుట్టపై జెట్టుగాఁ బుట్టవచ్చు
వసుధలోనావంటి వనితజన్మముకంటె
వనములో మృగముగాఁ దనరవచ్చు
క్షితిలోననావంటి యతివజన్మముకంటెఁ
జెట్టుపై బిట్టగాఁ జెలఁగవచ్చు
నిట్టిసంసారవారాశి నిముఁగుకంటె
నీస్థలంబున గతికర్రయై నెగడవచ్చు ॥పుడమి॥ 26.

సీ॥ వసుధనీసంసార వాసనదొలఁగంగ
సరవిన్వైకుంఠమే స్థానమరయ
నాదిలక్ష్మీదేవి యమరంగనాతల్లి
యామన్మథుండె నాకన్నగారు
దామోదరుండె నాతండ్రియామతిలోక
బాంధవుండగునాకు బాంధవుండు
బ్రహ్మాదులేచుట్ట పక్కంబులౌదురు
జ్ఞానమేగురుఁడగు శాంతిసుఖము
ఇట్టివారిసహాయంబు గట్టివయ్యె
పితృపతులకింక నేవిల పింపనేల ! ॥పుడమి॥ 27.

సీ॥ విద్యనేర్చినవాఁడు విశ్వమందుసుఖించు
వినయగుణంబుచే వెలయుచుండు
సాధుసజ్జనులతో సాంగత్యమొనరించు
నిఁపువాక్కులు వెలయింపఁ జేసి

రాజసభలలోన రంజనమొనరించు
విద్వాంసులకు మది వేడ్క సేయుఁ
జోరులుగొనిపోవఁ జొప్పడదన్నద
మ్ములభాగములకది యలవిగాదు
ఇతరులకునీయఁ దఱుఁగదు హెచ్చుగాని
స్వచ్ఛమగువిద్యకిలఁ జూడ సమము లేదు ॥పుడమి॥ 28.

సీ॥ అవనిలోనరుఁడుగా నవతరించినవాఁడు
విద్యామతులునేర్చి వెలయవలయుఁ
బుడమిలోఁ బురుషుఁడై పుట్టియుండెడివాఁడు
పురుషోత్తమునికీర్తి పొగడవలయు
ధరణిలో మనుజుఁడై తనరినవాఁడెప్డు
ధర్మమార్గంబును దలఁపవలయు
భువిలోన మగవాఁడు పుణ్యంబుఁ దలపోసి
పురుషార్థమగుపనుల్ పూనవలయు
నుర్విలోపలఁ దన ప్రాణముండువఱకుఁ
బరులకుపకారవర్తియై బ్రదుకవలయు ॥పుడమి॥ 29.

సీ॥ వసుధలోనవివేకి వాఁడొనర్చిన యన
త్యంపుఁ గార్యము సత్యమనితలంచు
ధరణిలోనవివేకి తనపుత్రులొనరించు
తగనిధర్మంబైన ధర్మమనును
బుడమిలోనవివేకి పుత్రికల్ గావించు
దుష్టకార్యములైన దొడ్డయనును

క్షితిలోనవివేకి సతియొనర్చిన దుష్ట
వర్తనమైన సద్వర్తనయను
నిట్టియవివేకిజ్ఞానంబు లెట్టులెఱుఁగు
నెఱుఁగనేర్చినధర్మజ్ఞుఁ డెఱుఁగుఁగాక ॥పుడమి॥ 30.

సీ॥ ధరణిలోసువివేకి తానొనర్చినయశ్వ
మేధంబునైనను మెచ్చుకొనఁడు
పుడమిలోసువివేకి పుత్రులుచేసిన
ధర్మంబువినిమదిఁ దనరఁడెపుడు
ధాత్రిలోసువివేకి పుత్రికల్ గావించు
పుణ్యావర్తనమెనఁ బొగడఁడెపుడు
క్షితిలోనసువివేకి సతియొనర్చినసత్య
వర్తనంబునుమెచ్చి వాడఁడెపుడు
ఇట్టిసువివేకిసద్ధర్మ మెఱుఁగుఁగాక
కష్టుఁడైనట్టియవివేకి గాంచగలఁడె ॥పుడమి॥ 31.

సీ॥ ధరణిలోమూర్ఖుఁడు ధనముసంపాదించి
దానముచేయక దాఁచిదాఁచి
వడ్డికిచ్చుచుఁదన వారిపైఁగృపలేని
వాఁడౌచు వడ్డికి వడితీసి
పెట్టెలోపలఁబెట్టి గట్టితాళమువైచి
కట్టుగానచ్చోటఁ గాచియుండి
సర్కారువారికి సంతర్పణముసేయు
ధర్మకార్యమునకు దమ్మిడీఁడు

ఒరులకివ్వక కుడువకిట్లున్న ధనము
దొంగలకో వాయుసఖునకో దొరలకోయగు॥పుడ॥ 32

సీ॥ ధరలోనధన్యుండు ధనముసంపాదించి
దానధర్మముచేసి దినరుచుండుఁ
దనతల్లిదండ్రికిఁ దనసహోదరులకు
సతులకు సుతులకు సమతనిచ్చు
హెచ్చువిద్యానంద మిష్టాన్నహితతృప్తి
బంధుజనప్రీతిఁ బఱపుచుండు
దేవతార్చనముల దివ్యతీర్థంబులఁ
దగురీతినొకభంగిఁ దనుపుచుండు
నిట్టిగుణవంతుడొనరింప నెల్లజనులు
సంతసింతురు సత్కీర్తి వంతుఁడంచు ॥పుడమి॥ 33.

సీ॥ తనయునిదండించి తగువిద్యనేర్పని
యబ్బయేసుతుపాలి బెబ్బులియగుఁ
బరకాంతలకుసొత్తు పాడొనరించెడు
నబ్బయేసతిపాలి బెబ్బులియగుఁ
ద్రాగుబోతై యింటి దర్పంబుఁజెఱచెడు
నబ్బయేపితపాలి బెబ్బులియగు
నప్పుతీయుచుఁగొంప నమ్మిభ్రష్టుండగు
నబ్బవంశమునకు బెబ్బులియగు
యిట్టియబ్బవంగడమునఁ బుట్టుకంటెఁ
బుడమిపై ఱాయిగానైనఁ బుట్టవచ్చు ॥పుడమి॥ 34.

సీ॥ తల్లిదండ్రులమదిఁ దల్లడిల్లఁగఁ జేయు
పుత్రుఁ డేవారికి శత్రుఁడగును
మతిలేకతలిదండ్రి మాటవిననియట్టి
పుత్రుఁ డేవారికి శత్రుఁడగును
తల్లిదండ్రులతోడఁ దగవులనాడెడు
పుత్రుఁడేవారికి శత్రుఁడగును
కఠినుఁడై తలిదండ్రిఁ గష్టంబుఁగూర్చెడు
పుత్రుఁ డేవారికి శత్రుఁడగును
ఇట్టి పుత్రుఁడు లేకుంట యేసుఖంబు
కలిగి యపకీర్తిపాలౌట కంటెభువిని ॥పుడమి॥ 35.

సీ॥ కూఁతురుదుర్బుద్ధి కొట్టితీర్చనితల్లి
తల్లిగాదదిమ్రాని పిల్లిగాని
పుత్రియవగుణంబు పొగడుచుండెడితల్లి
తల్లిగాదదిపల్కు బల్లిగాని
పొరుగిండ్లుదిరిగెడి పుత్రినొంచనితల్లి
తల్లిగాదదిచెడు నల్లిగాని
దబ్బరాడెడుకూఁతు దెబ్బవేయనితల్లి
తల్లిగాదూసర వెల్లిగాని
యిట్టితల్లికెన్నఁగ నల్లుఁడెవ్వఁడగునొ
వాఁడుతలిదండ్రులనుమున్ను వదలవలయు ॥పుడ॥ 36.

సీ॥ తల్లిదండ్రులమాటఁ దగవినకుండినఁ
గూఁతురేయదివెఱ్ఱి కోఁతిగాక

అన్నదమ్ములతోడ నైకమత్యము లేని
కూఁతురేయది వెట్టి కోఁతిగాక
మాటకుమాటాడి మంకుచేష్టలుచేయు
కూతురేయది వెట్టి కోఁతిగాక
కనుసన్నతోఁ బనుల్ గావింపకుండినఁ
గూఁతురేయది వెట్టి కోఁతిగాక
యిట్టికూఁతులనొరులకు నిచ్చితల్లి
యత్తగారిదితప్పని యనఁగనేల ? ||పుడమి|| 37.

సీ|| జంకకవిభునితో జగడమాడెడు పెండ్ల
మాలుగాదది నెత్తివ్రాలుగాని
నగలకై విభునితోఁ దగనిమాటాడెడి
దాలుగాదది మూర్ఖురాలుగాని
ఏవేళవిభునితో నెదురాడుచుండెడి
దాలుగాదది గవ్వరాలుగాని
పతినిదావంచించి పరులనాసించెడి
దాలుగాదది నల్లతేలుగాని
ఇట్టి సతులున్నపతులకు నేమిసుఖము
కొడుకులొకపదిగల్గిన విడువవచ్చు ||పుడమి|| 38.

సీ|| పతియెదైవంబంచు మతినెంచిసతతంబు
పూజించుకాంతయే పుణ్యచరిత
ధవుఁడెనాపాలిటి ధర్మదేవతయని
దండంబులిడుకాంత ధన్యచరిత

భర్తనాపాలిటి భాగ్యరాశియటంచు
భావించుకాంతయే భవ్యచరిత
తనప్రాణనాథుఁడే తనకుఁబ్రాణంబని
తలపోయుకాంతయే ధర్మచరిత
వేయికష్టంబులొందిన విభునిమాట
దాఁటఁజాలనికాంతయే దారయగును ॥పుడమి॥ 39.

సీ॥ ఇండ్లుమేడలుతోఁట లేర్పించియిమ్మని
విభునితోనవివేకి రభసమాడుఁ
బట్టుపుట్టముదెచ్చి పెట్టకకాదని
విభునితోనవివేకి రభసమాడు
భూషణంబులులేని దోషమేమనికేరి
విభునితోనవివేకి రభసమాడు
నింటబియ్యములేక యెట్లువండుదునని
విభునితోనవివేకి రభసమాడు
నిట్టియవివేకియుండిన యింటలక్ష్మి
యెట్టులుండునుమాదేవి యేడ్చుఁగాక ॥పుడమి॥ 40.

సీ॥ మణిమందిరంబైన మఱికుటీరంబైన
సమముగావర్తించు సద్వివేకి
పట్టుపుట్టంబైనఁ బ్రాఁతబట్టైనను
సమముగాలెక్కించు సద్వివేకి
అంబలైననుషడ్రసంబులైననుమది
సమముగానెంచును సద్వివేకి

దుఃఖంబు రాఁగ సంతోషకాలము రాఁగ
సమముగాఁగడపును సద్వివేకి
ఇట్టిసువివేకిధరనేరి యింటనున్న
నిందిరాదేవివసియించు మందిరమది ॥పుడమి॥ 41.

సీ॥ తల్లిదండ్రికిమ్రొక్కి దనసతిఁ బ్రేమించు
నురుగుణుండగు పురుషోత్తముండు
సతికినుత్తమమైన హితములేబోధించు
నురుగుణుండగు పురుషోత్తముండు
తరమెఱుంగక భార్య తప్పుఁ జేసినఁగాచు
నురుగుణుండగు పురుషోత్తముండు
అవివేకియగుసతిఁ సువివేకిఁగాఁ జేయు
నురుగుణుండగు పురుషోత్తముండు
ఇట్టిపతిఁగూడివర్తించు నింతితొల్లి
యెన్నినోములునోచునో! యెఱుఁగవశమె ? ॥పుడ॥42.

సీ॥ ప్రాహ్ణంబునను లేచి పతిపాదములవ్రాలు
పణఁతికిపసిడి కంకణములేల ?
అధిపునిపల్కుల కానందమొందెడి
కాంతకువజ్రాల కమ్మలేల ?
అతిప్రేమభర్తగా ఢాశ్లేషమునఁ దేలు
రమణికి రత్నహారంబులేల ?
పతిసేవ తనకు సద్గతియని యెదనెంచు
వనితకు దేవతార్చనములేల ?

భర్తనీరీతిఁ బూజించు పద్మనయన
యిందిరా దేవియేయని యెన్నవచ్చు ॥పుడమి॥ 43.

సీ॥ కులకాంతవిడిచి యన్యులకాంతఁ గోరిన
పురుషుఁడునాపాలి పూర్వకర్మ
మద్యపానముచేత మతిచెడిమర్దించు
పురుషుఁడునాపాలి పూర్వకర్మ
వెసనింటఁగలసొమ్ము వెలవెలందులకిచ్చు
పురుషుఁడునాపాలి పూర్వకర్మ
మేవేళఁబగఁగొని యేడ్పించుచుండెడు
పురుషుఁడునాపాలి పూర్వకర్మ
మనుచువిసువక పతిసేవ నలరుచెలువ
కీర్తిమూఁడులోకంబుల నర్తనించు ॥పుడమి॥ 44.

సీ॥ అత్తతోఁ జగడంబు లాడుచుండెడుబోటి
యాఁడుదే యది వెట్టిగాడిదయగు
మామబావలకును మాఱొడ్డితిరిగెడి
దాఁడుదే యది వెట్టిగాడిదయగు
మందులనిప్పించి మగనిలోఁగొనునట్టి
దాఁడుదేయది వెట్టిగాడిదయగు
నింటిగుట్టును బొరుగిండ్లలోఁ జెప్పెడి
దాఁడుదేయది వెట్టిగాడిదయగు
నిట్టిగాడిదయని దాని నెన్న నేల?
తల్లిదండ్రులతప్పని తలఁపవలయు ॥పుడమి॥ 45.

సీ॥ అత్తయుండినఁగదా యతివపుట్టింటికిఁ
బోయివచ్చుచునుండు పుణ్యమబ్బు
నత్తయుండినఁగదా యతివసంసారంబు
సాగించుటకు మేటి సాధనంబు
అత్తయుండినఁగదా యతివపుత్రులనెల్లఁ
బోషించుటకుఁగల్ప భూజమగును
అత్తయుండిన గదా యతివకష్టాబ్ధిని
దేలిగట్టెక్కఁగఁ దెప్పయగును
అనుచుయోజించి యుత్తమురాలైనకోడ
లత్తగారినిసేవించి యలరవలయు ॥పుడమి॥ 46.

సీ॥ పరులపుత్రిక మనముఁ బుగుచొచ్చెనటంచు
సుతసమురాలుగాఁ జూడవలయు
నన్నమలంకార మారోగ్యమైశ్వర్య
మత్తకోడండ్ర కియ్యంగవలయుఁ
బనిపాటులెఱుఁగని పడఁతియైనను దానె
తిన్నగా నారీతిఁ దెలుపవలయు
హెచ్చుపెత్తనములనీయక కోడల
ట్టిట్టుపల్కినను దండింపవలయు
నట్టియుత్తమమైనట్టి యత్తగారి
బూజచేసెడికోడండ్రు పుణ్యవతులు ॥పుడమి॥ 47.

సీ॥ పలుగాకిచేడెకుఁ బతివ్రతయెదురైనఁ
గంటకంబుసరణిఁ గానవచ్చు

దొంగచెలువయుత్త మాంగనంగన్నచోఁ
గాలసర్పమువలెఁ గాంచుచుండు
సతిమూర్ఖపుఁబడతి యుత్తమాంగఁగన్న
నెత్తిపైఁబడుగల్లి తత్తఱించు
లమిడివిధవశుచిత్వముగలస్త్రీఁగన్న
హేళనంబులుచేసి యొత్తిపొడుచు
నుత్తములకును సధములకుప్పునిప్పు
గలసినట్లుండుసఖ్యంబు గాంచఁగాను ॥పుడమి॥ 48.

సీ॥ ఉత్తమవనితకు సత్తమామలులేని
సంసారమేదుఃఖ సాగరంబు
అతిదయాశాలిని కాఁడుబిడ్డలులేని
యిల్లుగచ్చల పొదరిల్లెయగును
భయభక్తిగలస్త్రీకి బంధువుల్లేకున్న
భవనంబుచూడ ఘోరవనమగును
రక్తిగలసతికి రాణింపులేనికాఁ
పురమూషరక్షేత్ర సరణియగును
ఇటులనెంచకతనప్రాప్త మింతయంచుఁ
గాపురముసేయుపొలఁతుక గాంచుఁగీర్తి ॥పుడమి॥ 49.

సీ॥ ఆఁడుబిడ్డలఁగన్న యతివలకెల్లను
నపకీర్తిగలుగక యలరువిధము
తనపుత్రి“కత్తకు దాసినీ”వనునట్టి
పరమధర్మము చెప్పి పనుపవలయు

మామలబావల మఱఁదులనుఁదులకు
నతివయుసూఱు మాటాడకుండఁ
బతియెదైవంబంచు మతినెంచియాయింటి
సుతవలెనయమున సతియునుండ
నత్తవారికిఁగనమీఁద నత్తుఁబ్రేమ
తల్లియింటికి సత్కీర్తి తనరునిజము ॥పుడమి॥ 50.

సీ॥ అత్తమామలమాట కడ్డమాడనికాంత
కాంతయేరతనాల దొంతిగాని
బావమఱఁదులకు బదులుపల్కనిబాల
బాలయేయది పిరి గోలగాని
పతిసేవకెన్నంతుఁ బ్రాలుమాలనియింతి
యింతియేయది పూల బంతిగాని
పతిబంధువులఁబ్రేమ భావించెడునతివ
యతివయేయపరంజి ప్రతిమగాని
యిట్టిసద్బుద్ధిగలిగిన యింతితోడఁ
గూడుకొన్నట్టిపతికి వైకుంఠమదియె ॥పుడమి॥ 51.

సీ॥ వనితలుపదుమూఁడు వత్సరంబులుదాఁకఁ
తల్లిదండ్రులయాజ్ఞఁ దనరవలయుఁ
బదునాల్గుమొదలుగాఁ బతియాజ్ఞలకులోఁగి
మెలఁగిసత్కీర్తిని నిలుపవలయు।
సుతుఁడుయౌవనదశాన్వితుఁడైన, వార్ధకం
బునఁదనసుతు నాజ్ఞ మనఁగవలయు

నిట్టివారలులేని యింతులుత్తమ బావ
మఱఁదులన్నలయొక్క మఱుఁగుచేరి
ఇహమునందిచ్ఛమాని పరేచ్ఛనుండు
టర్హమగునొంటినుండఁగ నగునెసతికి! ॥పుడమి॥ 52.

సీ॥ పతిలేనిసతిదుష్ట పతియయ్యెనేనియు
చ్ఛలపరాక్రమ శాలినియగు
నత్తమామలుదానికదరుచుందురు బావ
మఱఁదులకెల్లను మానముచెఱుఁ
దోడికోడండ్రకుఁ దొలఁగనిభూతమౌ
నాఁడుబిడ్డలకు దుఃఖాబ్ధియగును
ఇంటివారికిఁ గానియింతులఁదిరుగుచు
జంటవారలఁగూడ జగడమాడు
నిట్టికట్టిడిపుట్టిన యింటికత్త
గారియింటికిఁనపకీర్తి గలుగఁజేయు ॥పుడమి॥ 53.

సీ॥ పతిలేనిసతిగుణ వతియయ్యెనేనితా
నత్తమామలపూజ లమరఁజేయుఁ
బతిలేనిసతిగుణవతి యయ్యెనేనితా
బావమఱఁదులకు సేవచేయుఁ
బతిలేనిసతిగుణవతి యయ్యెనేని తా
నాఁడుబిడ్డలమాట కడఁగియుండుఁ
బతిలేనిసతిగుణవతి యయ్యెనేనితాఁ
బతి ప్రతిబింబంబు మతినెఱుంగు

నిట్టిసద్వృత్తిగలిగిన యిందువదన
రెండుచోటులనిండుఁగీర్తిని నిరతము ॥పుడమి॥ 54.

సీ॥ పురుషుఁడు లేనట్టి పొలఁతిసౌందర్యంబు
పలుకనిచిత్రంపుఁ బ్రతిమగతియు;
పురుషుఁడు లేనట్టి పొలఁతివైభవమెన్న
వనదుర్గచంద్రికా వైభవంబు;
పురుషుఁడు లేనట్టి పొలఁతివిద్యలుచూడఁ
జౌటవర్ధిల్లు సస్యముల తెరఁగ;
పురుషుఁడు లేనట్టి పొలఁతిసంపదలెన్న
బాలునిచేతికృపాణమయగు;
నిట్టినిర్భాగ్యజన్మంబు లెత్తుటలు భ
వత్కృతముగాదువారి పూర్వకృతఫలమె; ॥పుడమి॥ 55.

సీ॥ పురుషుఁడు లేనట్టి పొలతియుండఁగరా
దుండెనేనియును దానుండుపథము
కామమనెడునంధ కారంబుదెగుటకు
జ్ఞానవైరాగ్యంబుఁ బూనిమదిని
మదమనుహస్తిని మ్రందించుటకుహరి
స్మరణాంకుశముయోగ కరమునందు
ధరియించిసుఖదుఃఖ దములైనశునకంబు
లనుజేరనీయక మనఁగవలయు
నిట్టులభ్యాసమొనరించు నింతినీదు
సదనముంజేరుటబ్రమే ? సారసాక్ష ॥పుడమి॥ 56.

సీ॥ మందుమగనికిచ్చి మఱపుగొందుననుచు
మదినెంచఁగానేల మగువలార !
కౌసల్యరత్నాంగి కన్నబిడ్డలకేడ్చి
విభులదండించిరే విమలలార !
దమయంతిద్రౌపది ధారుణీపుత్రిక
విపినముల్ తిరుగరే ? విభులఁగూడి
చంద్రమతియు హరిశ్చంద్రునిమాటకై
కాలకౌశికునింటఁ గష్టపడదె ?
యిట్టిధర్మసూక్ష్మంబుల నెఱిఁగిమీరు
పతులసేవించిబ్రతుకరే పడఁతులార ! ॥పుడమి॥ 57.

సీ॥ పరపురుషునిగోరి పడఁతిశూర్పణఖ నా
సికనుగోల్పోలేదె ? క్షితితలమున
నారులసంతతికిఁ దానోర్వనిపనిచేసి
దుర్యోధనునితల్లి దుఃఖపడదె ?
గర్వమైశర్మిష్ట కవికూఁతునూతిలోఁ
ద్రోసియామెకుఁదానె దాసిగాదె ?
సవతిమత్సరముచే సత్యభామకలంగెఁ
బారిజాతసుమంబుఁగోరి, మఱియుఁ
బుడమిగూడనిపనిచేసి చెడినవారి
నెంచియోర్పునవర్తింప మించుఁగీర్తి ॥పుడమి॥ 58.

సీ॥ పరకాంతలనుగోరి పాడుగానేలయ
హల్యకై యింద్రుడు దేహంబుచెడదె ?

పతివ్రతలనుగోరు పనియె కారాదిలఁ
బాంచాలికై సింహబలుఁడు చెడఁడె ?
కోలఁదెఱుంగక బోయ కోరఁగ, దమయంతి
శాపాగ్నిదగ్ధుఁడై చచ్చిపోఁడె ?
మగనాలుగానున్న మైథిలిఁగొనిపోయి
రామచేఁగూలఁడే రావణుండు
స్త్రీలకై ప్రాణమానముల్ చెఱుచుకొనక
మనసునిలిపిన మనసిజు నణఁపవచ్చు ॥వృడమి॥ 59.

సీ॥ కోపంబుమిక్కిలి పాపంబుగలహాగ్ని
రూపంబు సత్సుగుణాపహంబు
కోపంబుదారిద్ర్య కూపంబుమూఢప్ర
తాపంబు సంపత్కరాపనోది
కోపంబుముఖతీక్ష్ణ రూపంబుమితిలేని
తాపంబుదుర్యశ వ్యాపకంబు
కోపంబుచెడ్డకుఁ గాఁపురంబై మహా
టోపంబుగలిగించి రూపడంచు
నగ్నిలేక కోపంబు దేహమునుగాల్చుఁ
గోపమొడలినమేలైన గుణమునిలుచు ॥వృడమి॥ 60.

సీ॥ కోపంబుమదికి సంతాపంబుఁగలిగించుఁ
గోపంబుఘనతను గొంచెపఱచుఁ
గోపంబుసుజ్ఞాన దీపంబునార్చును
గోపంబుసాత్త్విక గుణముఁజెఱుచుఁ

గోపంబుశత్రుల కులమొనఁగూర్పించుఁ
గోపంబునరకాబ్ధిఁ గూలఁద్రోయుఁ
గోపంబు దేహంబుఁ గొఱవిలేకయ కాల్చుఁ
గోపంబుహత్యలకు నెడమిచ్చుఁ
గోపమేశత్రువంచు నాకోపగుణము
విడువవలయును సదసద్వివేకులెపుడు ॥పుడమి॥ 61.

సీ॥ చదలనక్షత్ర సంచయమెంచఁగావచ్చుఁ
దవిలి శేషుని తలఁదట్టవచ్చు
నావలీవలిదరి కబ్ధినీదఁగవచ్చు
గాలినైనను బట్టి కట్టవచ్చు
నెఱ్ఱఁగాఁగాచిన యినుము మ్రింగఁగవచ్చుఁ
గార్చిచ్చుపడి మూటగట్టవచ్చు
గిరులనచ్చనగుండ్ల కరణినాడఁగవచ్చుఁ
దెంపుగావసనాభిఁ దినఁగవచ్చు
మూఢమతులను సద్ధర్మమునమెలంగు
నటులఁజేయనజునకైన నలవికాదు॥ ॥పుడమి॥ 62.

సీ॥ పలుగాకిసతియైన పతిగౌరవముచెడుఁ
గూఁతురుచెడుగైనఁ గులముచెడును
జీడపురుగుచేరఁ జెట్టుమొత్తముచెడు
నల్లిచేరిన మంచమెల్లఁజెడును
మనసునిల్పనివారి మానమెల్లనుజెడు
గొండెంబులాడినఁ గొంపచెడును

భు_క్తిదప్పినయెడఁ బురుషుదేహముచెడు
సత్యంబుదప్ప యశంబుచెడును
నినుభజింపక కాలమెల్లనుగడపిన
జనముచావుపుట్టుకలలో మునిఁగిచెడును ॥పుడమి॥ 63

సీ॥ అంతఃపురాళితో మంతనంబులుచేటు
చెలిమియల్ప్రులతోడఁ జేయఁ జేటు
సరిగానివారితో సరసమాడుటచేటు
పరులఁజెఱుపఁదానె పడయుఁజేటు
పాపబుద్ధులను జేపట్టిననగుఁజేటు
మూర్ఖునిస్నేహంబు మొదలెచేటు
జారచోరులచెంతఁ జేరుచుండుటచేటు
మద్యపాయులఁగూడ మఱియుఁజేటు
కానిగుణములనన్నింటిఁ గడకుఁద్రోసి
మెలఁగనేర్చినవాఁడె భక్తుఁడగునీకు ॥పుడమి॥ 64.

సీ॥ సారమెఱుంగనిచదువు వినుటరోఁత
వగలేనిబంటుసేవఁ గొనరోఁత
అతిలోభిఁదగ్గఱ నప్పతీయుటఁరోత
కొండీనితోఁబగగొనుటరోఁత
తాటోటువారల దరిఁజేరుచుటరోఁత
కోళ్ళసాఁకెడివారి కొంపరోఁత
పోకువర్తులులేని పురుషునిపనిరోఁత
బుద్ధినిల్వనివాని పూజరోఁత

రోఁతనడతలవీడి నిర్బూతమతిని
బూజచేసెడివానిదే పుణ్యమంద్రు ॥పుడమి॥ 65.

సీ॥ భూపాలకునకుఁ బ్రజాపాలనమెకోర్కి
మంత్రికాలోచనా మహిమకోర్కి
ధరణిలోదాతకు దానమిచ్చెడుకోర్కి
చెడులోభికి ధనమార్జించుకోర్కి
కవులకునుత్తమ గ్రంథరచనకోర్కి
ఖలునకుఁగలహంబు గలుగకోర్కి
చోరులకితరుల సొమ్ముపైఁగోరికి
పలుగాకికితరుల వలచుకోర్కి
తాపసులకును నిర్మదిఁదలఁచుకోర్కి
కోర్కెలీడేర్పనీయొక్క గుణముగాదె ॥పుడమి॥ 66.

సీ॥ కాశికేఁబోవఁగాఁ, గర్మంబుదీఱునా
కాశికిబోవవే కాకులెపుడు
జలములఁగ్రుంకఁ, రాఁజాలునా మోక్షంబు
జలములనుండవే జలచరములు
తపముచేఁదనువును దపియింపఫలమౌనె?
తలక్రిందుగ్రేలవే ధరఖగములు
వనబిలంబులనుండ వశుఁడౌనె దేవుండు
బిలములందుండవే యెలుకలెపుడు
ఇట్టి కష్టమౌవిద్యల నెల్లవిడిచి
బుద్ధినీయందునిలిపినఁ బొందుముక్తి ॥పుడమి॥ 67.

సీ॥ ఒరులపై శత్రుత్వ మూంచకుండినఁజాలు
నుపవాసములునిత్య ముండినట్లు
పరులమనసునొవ్వఁ బల్కకుండినఁజాలుఁ
జతురత వేదముల్ చదివినట్లు
ఇతరులసొమ్మాశ్రయించకుండినఁజాలు
నోపికతో ధర్మ మొసఁగినట్లు
వారువీరనిపర్వ వాఱకుండినఁజాలు
దివ్యతీర్థములకుఁ దిరిగినట్లు
చాడిమాటలనొకరిపై సాహసమునఁ
బెట్టకుండినఁజాల్ గుడుల్ గట్టినట్లె ॥పుడమి॥ 68.

సీ॥ ధనమున్న బంధువుల్ దనచుట్టునుందురు
లేకున్న రారుగా లోకులెవరు
ధనమున్న భృత్యులు తనయింటవర్తింత్రు
భువిని లేకున్న శత్రువులువారె
ధనమున్న నందఱు దనకుమిత్రులుధన
హీనతయైనచో హితముసున్న
ధనమున్నఁ గాంతలు దన్నుఁ బ్రేమింతురు
లేకున్నఁ దలఁతురు కాకసముగ
నిట్టికలియుగధర్మంబు నెంచిప్రజలు
ధనముసద్వృత్తినార్జింపఁ దలఁపవలయు ॥పుడమి॥ 69.

సీ॥ తల్లితండ్రులుగల తనయులుసుఖులన్నఁ
బ్రహ్లాదుకష్టకారణమదేరు ?

పతిగల్గుసతిసుఖ వతియున్నసభఁగృష్ణ
పరిభవపడువేళఁ బతులు లేరె?
సుతులుగల్గినయట్టి సుదతులుసుఖులన్న
తల్లిఁద్రుంపడే తపసిసుతుఁడు?
అన్నదమ్ములుగల యతివలుసుఖులన్న
హింసింపఁడేచెల్లెఁ గంసుఁడును
కాలకర్మంబు గదిసిన వేళలందు
నెవ్వరునుగారునీకన్న నిందిరేశ! ॥పుడమి॥ 70.

సీ॥ బొంకనేర్చినవానిఁ బొంతనుంచఁగరాదు
వంతాడుబంటుతో వాదరాదు
పొంచులువినువానిఁ బంచనుంచఁగరాదు
వంచనగలవాని నెంచరాదు
దొంగిలించెడివానిఁ దోడుపిల్వఁగరాదు
సింగిబింగిరివానిఁ జేర్పరాదు
తప్పుచేసెడివానిఁ గప్పిపుచ్చఁగరాదు
తనకుమించినసుతుఁ దలఁపరాదు
ఇట్టివారలఁగూడక యెల్లజనులు
సాధులనుగూడినీభక్తి సల్పుటొప్పు ॥పుడమి॥ 71.

సీ॥ ఖగములై యింద్రాగ్నులు గనివేఁడఁగమాంస
మీయఁడేశిబివారి కిష్టమతిని
సురపతికపటభూసుర వేషమునవేఁడఁ
దనప్రాణమావిగో చనుఁడొసఁగఁడె?

వృత్రవధార్థమై యేగిసురుల్ వేఁడఁ
దనదేహమివ్వఁడే తగఁ దధీచి
బర్హికేతనుఁ గృష్ణ పార్థులుద్విజరూప
మున వేఁడ నతఁడర్ధ తనువునీఁడె ?
ఇట్టివారల చరితము లెల్లఁ దెలిసి
మాటనిలుపంగవలయును మానధనుఁడు॥ పుడమి॥ 72.

సీ॥ కడుఁ బ్రయత్నము లేక కనలేరు పున్నెంబు
గడియలోఁ బాపంబుఁ గానవచ్చు
నతిప్రయాసమునగాని కర్థంబు దొరకదు
నిమిషంబులో లేమి యమరవచ్చు
బహుకాలమునఁ గాని పడయదు సత్కీర్తి
యపకీర్తియఁ క్షణమందె వచ్చు
జిరకాలమగుఁ గాని చెట్టువృద్ధికిఁ దేఁగ
ఖండింపఁ గానొక్క గడియచాలు
సులభమని తుచ్ఛకార్యముల్ సలయుకంటెఁ
గష్టపడియైన నిను మదిఁ గాంచవలయు ॥ పుడమి॥ 73.

సీ॥ దయయు సత్యము లేని ధరణీశు రాజ్యంబు
ముంగోపియగునట్టి ముని తపంబుఁ
బెనులోభియైనట్టి ధనపతి భాగ్యంబుఁ
బతివ్రత లేనట్టి భవ్యగృహముఁ
బుత్రసంతతి లేని పురుషుని వంశ మిం
ద్రియలోలుఁడగు వాని దీర్ఘవ్రతము

గురుభక్తిలేనట్టి వరమహామంత్రంబుఁ
బతిభక్తిలేనట్టి పడఁతివ్రతము
నెట్లుచూచిన నిష్ఫలం బిలనటంచు
వృద్ధిఁబొందెడిమార్గ మూహింపవలయు ॥పుడమి॥74.

సీ॥ సత్యమాడుటకంటె స్వచ్ఛమౌవ్రతమెద్ది?
యనృతంబుకంటెఁ గీడరయనెద్ది?
అవివేకమునకంటె నంధకారంబెద్ది?
సువివేకమునకంటె జ్యోతియెద్ది?
పటుకోపమునకంటెఁ బరఁగశత్రువదెద్ది?
శాంతముకంటె సత్సతియదెద్ది?
సత్కీర్తికంటెను సత్యలోకంబెద్ది?
యపకీర్తికంటెను దపనమెద్ది?
అనుచు యోచించి యిదియెల్ల నాత్మనెంచి
పుణ్యవర్తనములనుండఁ బొందుయశము ॥పుడమి॥75.

సీ॥ అపరంజిపుట్టదే యమరగనులయందు
ముత్తెంబుపుట్టదే నత్తయందు
మృగమందుఁబుట్టదే యెనయంగఁగస్తూరి
పద్మంబుపుట్టదే పంకమందు
నిలఁదేనెగల్గదే యీఁగజాతివలనఁ
బురుగులందునఁ బట్టుపుట్టలేదె
శిలలందుఁబుట్టదే చెలువైన వజ్రంబు
తరువులఁబుట్టదే దావవహ్ని

సచ్చరిత్రుఁడు పుట్టఁడే కుచ్చితునకుఁ
గులముఁ జూడంగనేల సద్గుణముగలుగ ॥పుడమి॥ 76.

సీ॥ పసిఁడియిత్తడియొక్క పగదినుండిన నేమి?
యొరపెట్టినను నిజ మూలుకొనదె
వెండితగరమొక్క విధమునుండగ నేమి?
నతికినన నఱుకున నరయఁబడదె?
యంచకొంగయు నొక్క యాకృతినున్నఁ బాల్
నీరు వేర్పఱచుచో వేరుపడదె?
కోకిల కాకంబు లేకరీతిగ నున్నఁ
బల్కుల రీతి వేర్పఱుపఁబడదె?
జ్ఞానులజ్ఞానులొకలీలఁ బూనియున్న
నేమి? మహిమవలన వారలెఱుఁగఁబడరె ॥పుడ॥ 77.

సీ॥ పాలవెల్లినిబుట్టు బాలచంద్రుని మేనఁ
బొలుపుగా నొకమచ్చ కలిగెఁగాదె
సర్వభూతలభార నిర్వాహియగు భోగి
పతికర్ణహీనుఁడై పరఁగలేదె
మూఁడుజగములకు ముఖ్యుఁడౌ దేవేంద్రుఁ
డరయ మేహాంధుఁడై యమరలేదె
పావనుఁడౌ నగ్ని భట్టారకుఁడు సర్వ
భక్షకుఁడనుపేరఁ బరఁగలేదె
యెట్టివారికినొకనింద పుట్టుచుండు
సకలజనసమ్మతిగనుండు చతురుఁడెవఁడు ॥పుడమి॥ 78.

సీ॥ అతిశుచిత్వంబొప్పు నతఁడగ్ర కులజుండు
వంశపావనుఁడైన వాఁడెసుతుఁడు
ఆత్మఁగన్గొనఁజేయు నతఁడెసద్గురుమూర్తి
తగవుదీర్చెడివాఁడె ధరనుబెద్ద
పాత్రమెఱిఁగియిచ్చు ప్రాజ్ఞుండెవితరణి
యాడితప్పనివాఁడె యవనిఁబ్రభుఁడు
ధరణినర్థులఁబ్రోచు వరుఁడెసంసారి ని
యతచిత్తుఁడగువాఁడె యతివరుండు
ఉత్తములువీరు క్షితి కుపయోగపరులు
ఇతరమనుజులు సామాన్యులెంచిచూడ ॥పుడమి॥ 79.

సీ॥ అల్పునకొనరించు నట్టిమేలెంచంగ
నడవిఁగాచిన వెన్నెలగునిజంబు
చపలాత్మునకుఁజేయు సౌఖ్యంబులెన్నఁగాఁ
గోఁతికిఁదలచుప్పు రీతియగును
మంచిబుద్ధివచించి మకురులఁదీర్చుట
పాడింటదీపంబు పరఁగినట్లు
ద్రోహులరక్షింప దొరకొనుటెల్ల సా
గరమందుఁనింగువఁ గలుపునట్లు
యెడ్డవారికినెంచెడు హితముబూడి
దందుఁ బన్నీరుపోసిన ట్లగునుగాదె ॥పుడమి॥ 80.

సీ॥ మదగజవితతికిఁ గొదమసింగ మొకటి
చాల దేలంఘించి సంహరింప
సారంగములపైకి శార్దూల మొకటైనఁ
జాల దేచెలరేఁగి సంహరింపఁ
బన్నగంబులపైకిఁ బక్షీంద్రుఁ డొకఁడైనఁ
జాలఁడేస్సైకొని సంహరింప
మార్జాలములపైకి మఱిసారమేయంబు
చాల దేయొకటైన సంహరింప
నిట్లు లసహాయ శూరుఁడై నట్టివాఁడొ
కండుచాలఁడెశత్రుల కడిమినడఁప ॥పుడమి॥ 81.

సీ॥ పాముపిల్లల తెచ్చి పాలోసి పెంచిన
విడుచునేకోఱల విషముకొంత
వేఁపవిత్తులు తేనె వేసియూరఁగఁ బెట్టఁ
జెడిపోవునేదాని చేదుకొంత
వెలలేనిపరిమళాదులు పూఁతపూసిన
నుల్లివాసనపోనె యుర్విఁగొంత
నల్లేరుకాడపై బెల్లంబుమెత్తింపఁ
దొలఁగిపోవునెదాని దురదకొంత
బుద్ధిమంతుఁడుజడునకు బుద్ధిచెప్పి
గతులుదెల్పినసద్బుద్ధి గలుగఁగలదె; ॥పుడమి॥ 82.

సీ॥ గంధగజముదిడ్డి సందుబందూఱునే
ధీరుండువిడుచునే దృఢగుణంబు

గొదమసింగములేళ్ల గుంపులైఁగవియునే
యధికుఁడుచొచ్చునే యల్పమునకు
ఘనతసరోవరంబున నీఁదురాయంచ
చేరునే గుంటలనీరుఁద్రావ
మందారమకరంద మధురమానెడు తేటి
చేరునే యుమ్మెత్త చెట్లకడకు
వసుధలోపలసద్గుణాన్వితుఁడైన
పురుషుఁడోపునె దుర్గుణంపుఁబనులకును ||పుడమి|| 83.

సీ|| వానరంబున కేల వజ్రకిరీటంబు ?
చెవిటికి సంగీత రవము దేల ?
గార్దభంబున కేల కస్తూరి ? ఐహికసుఖ
సంగతమతికి మోక్షసుఖమేల ?
అంధుని సొగసున కద్దమేల ? జగతి
ఖలునకు సద్ధర్మ కార్యమేల !
మార్జాలమున కేల మాఘపురాణంపు ?
కుత్సితునకు మదిఁ గూర్మియేల ?
ధరఁబ్రసిద్ధులకొప్పిన సరణులెల్ల
జడులకబ్బిన గేలికాస్పదముకాదె ||పుడమి|| 84.

సీ|| వంశంబునిలుపని వరకుమారుండేల?
కాలంబునకు లేని కలిమియేల ?
దయయుశాంతములేని ధరణీశుకొలువేల ?
మతినూహలేనట్టి మంత్రియేల ?

పూర్ణేందుముఖిలేని భూరిమందిర మేల ?
హితములేనట్టి స్నేహితమ దేల ?
ఒకరిసంపదఁజూచి యోర్వనిగుణమేలఁ ?
ధర్మంబునకుగాని ధనమ దేల ?
దుష్టగుణములు దొలఁగంగఁ ద్రోసి మోక్ష
సరణిఁజూపంగ లేని సద్గురుఁడిఁ కేల ॥పుడమి॥ 85.

సీ॥ మహిలోనసౌందర్య మన్మథుఁడగువాని
కతికురూపయయిన యతివఁగూర్చుఁ
క్షితిలోనసౌందర్య వతియైన యువతికి
వికలాంగుఁడగునట్టి విభునిఁగూర్చుఁ
సకలధర్మజ్ఞాన సత్యచారిత్రుని
ధనహీనుఁడగు దరిద్రునిగఁ జేయు
నతికఠినుండైన యవివేకి కిహమందు
సకలసంపదలు హెచ్చంగనిచ్చు
బ్రహ్మవ్రాసినవ్రాలని పలుకరాదు
నరులప్రారబ్ధకృతమని యెఱుఁగవలయు ॥పుడమి॥ 86

సీ॥ ధనికినాభరణంబు దాక్షిణ్యముండుట
విద్యకాభరణంబు వినయముంట
వనితకాభరణంబు పతిభక్తి వెలయుట
యింటికాభరణంబు లెనయసుతులు
తల్లికాభరణంబు దనయులసద్బుద్ధి
యతులకాభరణమా నమితశమము

నరులకాభరణమా నోడులకుసుపకృతి
చెట్లకాభరణంబు చెలఁగుఁబండ్లు
ప్రతిదినంబునునిన్ను సద్భక్తితోడ
గణనసేయంగ సకలాభరణములగును ॥పుడమి॥ 87.

సీ॥ వనితలహృదయంబుఁ గనఁజాలకయెగాదె
త్ర్యంబకుండాగంగఁ దలను దాల్చె
కాంతలమర్మముల్ కానరాకయెగాదె
పడతివాక్కునఁనుంచెఁ బద్మభవుఁడు
అతివలచిత్తంబు లరయజాలక కాదె
యురమునశ్రీలక్ష్మి నుంచెహరియు
నింతులభావంబు నెఱుఁగఁజాలక కాదె
సతినరుంధతి వసిష్ఠమునిగాచె
నెంతపతిభక్తి గలిగిన నింతివిభుఁడు
చెంతనుంచుట ధర్మంబు సృష్టిలోన ॥పుడమి॥ 88.

సీ॥ తగురీతిదానంబు దనరకుండెడిగీము,
గీముగాదది పెనుబాముగాని;
జననీజనకులకు సౌఖ్యమొసంచనిబిడ్డ,
బిడ్డగాఁదిక మట్టిగడ్డగాని;
పతిమాటకడ్డంబు పలికినొప్పించునా,
లాలుగాదది నల్లతేలుగాని;
సాధుసజ్జనబంధు జనులకీనిధనంబు,
ధనముగాదద్ది యింధనముగాని;

హెచ్చుభక్తిని మిమ్ముఁ బూజింపఁ జేని
నరుఁడు గాఁడాతఁ డరయ వానరుఁడు గాని ॥పుడ॥ 89.

సీ॥ కందురానినునాథుఁ డందురానన్నెల
కున్న నీకున్నతి యొప్పుగాదు
బల్కవానీదయఁ జిల్కవానామెడఁ
జుల్కగాఁ జూడకే సుభగమూర్తి
కానరాదయనులో కానరామానుజ
కానరానీవంటి దీనవరదు
నెంచరానన్ను బాలించరానా మొఱా
లించరా నిన్ను మెప్పించనేర
వంచనగుణంబుమాని మన్నించుభువిని
నిష్ఠురోక్తులిఁకేలరా నీకునాకు ॥పుడమి॥ 90.

సీ॥ వద్దురాకోపంబు రద్దురానీకీర్తి
యిద్ధరాస్థలిశాంత మేఘనంబు
కంటివానా మొఱల్ వింటివామిక్కిలి
తుంటవానేనేమి యంటినన్ను
నిందురానీమూర్తిఁ గందురాకనుచునే
నొందగానట్టి నీయందుఁ జొత్తుఁ
బిలుతురానిన్ను నే దలఁతురాహరియంచు
నిలుతురానీభక్తి గలతలమున
సకలవిధముల నీనామ సంస్మరణమె
జీవనమ్మయ్యె నీయరా జీవముక్తి ॥పుడమి॥ 91.

సీ॥ వంచనలేలమన్నించి నా మొఱనాల
కించి రక్షించు విరించిజనక
మించునాభవములఁ గ్రుంచవే బిడ్డయ
టంచుభావించవే యంచితాంగ
దోషమాజన్మ విద్వేషమాయింత
విశేషమానాకోడ భాషలాడ
విఫలరాగంబుచేఁ జపలురాలై తిని
కృపణురాలనక రక్షింపనిపుడు
వచ్చికనులార దర్శన మిచ్చినన్నుఁ
గాచి కడతేర్ప సత్కీర్తి గల్గునీకు ॥పుడమి॥ 92.

సీ॥ వసుదేవసుతుఁడె నా వాంఛితంబీడేర్చు
ననిచూచుచుందునే ననుదినంబుఁ
బశుపతిసఖుఁడె నాపాలిదేవుఁడని
యనిశంబునమ్మితి నాత్మలోన
నందతనూజుండె నను బ్రోచుదొరయని
నమ్మియుందును నామనంబునందు
లక్ష్మివిభుండునన్ రక్షింపఁగలఁడని
నిత్యంబుపూజించి నెగడుచుందు
నిట్లునమ్మినదాననే సింది రేశ
పక్షివాహనమెక్కి ప్రత్యక్షమగుము ॥పుడమి॥ 93.

సీ॥ ఏలరాయీజాగు లేలరా నేఁడాళఁ
జాలరాననునేల వేలదేవ

వింటి నీకీర్తి గన్గొంటి నీమాపు నీ
కంటె దేవుండు లేదంటినాకుఁ
గోపమానేఁ జేయు పాపమా యిదియేమి
తాపమా యీమనస్తాపమేమి
మంటిరా యీభువి నుంటిరా నినువేఁడు
చుంటిరా నన్బ్రోవు మంటిరామ
వలదుకోపంబు నాచేయి వదలవలదు
పద్దువిడిభవరోగంబుఁ బాపవయ్య ॥పుడమి॥ 94.

సీ॥ పరిపరిగతులనీకుఁ బ్రార్థనజేసినఁ
బలుకకయుంటనా పాపమేమొ
కరములుమోడ్చినేఁ గరమర్థిమ్రొక్కఁగ్రీ
గంటఁజూడవిది నాకర్మమేమొ
భక్తపాలననిన్ను భజనజేసెడినాదు
భవముఁ బాపనిది దౌర్భాగ్యమేమొ
దొడ్డదేవుండని దోసిలొగ్గినఁగడ
ద్రోసిపోయెడిది నాదోషమేమొ
నిన్నుదలఁచుచుదోషముల్ నెట్టికొంటిఁ
దుదకుదోషంబులేదు నిర్దోషురాల ॥పుడమి॥ 95.

సీ॥ కమలలోచననేను గాపురంబెఱుఁగను
నీకాపురమునందె నిలిచినాను
బతితపావననేను బనిపాటులెఱుఁగను
నీసేవచేయుచు నిలిచినాను

బరమపురుషయెట్టి పాపంబులెఱుఁగను
నిన్నెతలంచుచు నిలిచినాను
గోదండపాణియే కోరిక లెఱుఁగను
నినుగోరిక్షితిమీద నిలిచినాను
ఇట్లు నేనుండ నీవునాయెడలఁగొంచె
మైన దయయుంచకుండుట న్యాయమయ్య! ॥పు॥ 96.

సీ॥ వరదరాజమదీయ వాంఛలుదీఱఁగా
నిన్నుజూచెడిభాగ్య మెన్నఁడయ్య ?
శేషాహిశయన సంతోషంబుతోడనీ
యొప్పురూపముగాంచు టెప్పుడయ్య
అలనాఁడు ద్రుపదజాహల్యాదులను బ్రోచు
ప్రేమనాపైఁగొంత పెట్టుమయ్య ?
మున్నునా ధ్రువుని సముద్ధరించినయట్లు
నన్నుమన్నించు టెన్నాళ్ళకయ్య ?
అట్టివారల రక్షించుటరుదుగాదు
నన్నురక్షింప నీకీర్తి యెన్ననిజము ॥పుడమి॥ 97.

సీ॥ కొన్నాళ్ళుతనతల్లి కుక్షిలోఁబిండమై
మూత్రాదులందున మునిగియుండు
జనియించియొకకొన్ని సంవత్సరంబులు
బాలుఁడై మూర్ఖతత్పరతమెలఁగుఁ
గాముకుండై కొంతకాలంబు యౌవన
కాంతలరతికేళిఁ గడపుచుండుఁ

బుత్రిపౌత్రులఁగని పొక్కుచుఁగొన్నాళ్ళు
కౌమారదశభ్రాంతి గలిగియుండు
వార్ధకంబునఁదనువెల్ల వణఁకుచుండు
నిట్టు వర్తించునరుఁడెట్లు నెఱుఁగునిన్ను ॥ప్రహ॥ 98.

సీ॥ అండపిండముల బ్రహ్మాండంబుననునీవె
బ్రహ్మాండముననున్న బయలునీవె
విష్ణుదేవుండునీవే యీశ్వరుఁడునీవె
యజుఁడునునీవె కృతాంతుఁడీవె
సూర్యచంద్రులునీవె సురలు శ్రుతులునీవె
యబ్ధులన్నియునీవె యనలుఁడీవె
నీకుక్షిలోపల నిఖిలంబుపుట్టుచు
నడఁగుచునుండు నెప్పుడుమహాత్మ
నీవుస్థూలసూక్ష్మాతీత నిర్మలుఁడగు
సుస్థిరుఁడవంచు మదిలోనఁజూడఁదలఁతు ॥ప్రహ॥ 99.

సీ॥ అణురేణుపరిపూర్ణుఁడగుచునుండెడివాఁడు
సోమసూర్యులను చక్షువులవాఁడు
నిత్యంబుసత్యమే నెఱపుచుండెడివాఁడు
నిత్యకల్యాణుఁడై నెగడువాడు
పాలమున్నీటిలోఁ బవ్వళించెడువాఁడు
పాదంబులనుగంగఁ బడయువాఁడు
ఉరమునందునలక్ష్మి నొప్పుచుండెడువాఁడు
పక్షివాహనమెక్కి ప్రబలువాఁడు

నాభినలువనుగన్న యనాదివాఁడు
దీనకరిమొఱవినిఁబ్రోవఁ దవ్వువాఁడు
ఉర్వివళ్ళివేడు పురమందుండువాఁడు
వనితనరసాంబనేపుడు గానఁగలవాఁడు॥ 100.

సీ॥ శ్రీరంగపురమునఁ జెలఁగినేఁజూచిన
నచ్చటనీరూప మమరియుండెఁ
గాంచీపురంబునఁ గరమర్థిఁజూచిన
నచ్చటనీరూప మమరియుండెఁ
గుంభకోణంబునఁ గోమరొప్పఁజూచిన
నచ్చటనీరూప మమరియుండె
రామేశ్వరంబున రంజిల్లఁజూచిన
నచ్చటనీరూప మమరియుండె
నెచ్చటెచ్చటఁజూచిన నచ్చటచట
నొచ్చునీముచ్చటలె గానవచ్చెనయ్య ॥పుడమి॥ 101.

సీ॥ వరదరాజానేను వర్ణించుపలుకులు
వజ్రహారమునీకు వసుమతీశ
విష్టరశ్రవనీకు విన్నవించువినుతి
మకరకుండలములు మానివంశ్య
అమరవందితనిన్ను నాశ్రయించెడుభక్తి
హస్తకంకణములో యంబుజాక్ష
పరమపురుషనేను బఠియించుపద్యముల్
పచ్చలపతకముల్ పద్మనాభ

ఇట్టిభూషణములచేత నింపొనర్చి
భక్తితోఁ దులసీదళార్పణముచేతు ॥పుడమి॥ 102.

సీ॥ హరినీదుకీర్తన యనుకుఠారమున న
జ్ఞానకాననమును నఱుకఁగంటి
రామనీసేవయనెడి రవిదీప్తిచేతనా
కామాంధకారంబు గడవఁగంటి
నచ్యుతనీపూజ యనునావచేనాదు
దుఃఖాబ్ధియవలీలఁ దాఁటఁగంటి
నవ్యయనీనామ మనుసుధఁజవిగొని
దేహతాపంబును దీర్చికొంటి
నిన్నుగనుఁగొంటినితరంబు నెన్నకుంటిఁ
దొంటినాభాగ్యమంటినో తోయజాక్ష ॥పుడమి॥ 103.

సీ॥ అండపిండాండబ్రహ్మాండభాండములెల్ల
నిండియుండెడినీకు దండమయ్య
సోమభాస్కరులు చక్షుద్వయంబులగు బ్ర
హ్మాండనాయక నీకు దండమయ్య
ఉరమందుశ్రీలక్ష్మి యొనరనాభినిబ్రహ్మ
తనరుచుండెడినీకు దండమయ్య
ఉదరమందఖిలంబుఁ గుదురుగానుంచిన
చండాంశుకులదీప దండమయ్య
దండమూర్తివినీకిదే దండమయ్య
దండితారాతినీకిదే దండమయ్య ॥పుడమి॥ 104.

సీ॥ మరకతాదసురత్న మణికిరీటముదాల్చు
మస్తకంబునకిదె మంగళంబు
శంఖసుదర్శనశార్ఙ్గ ఖడ్గగదాగ్ర
మహితచతుర్భుజ మంగళంబు
శ్రీవత్సకౌస్తుభ శ్రీవనమాలలు
రంగారునెదకును మంగళంబు
జగములరక్షింప జాహ్నవిఁ బుట్టించు
మండనాంఘ్రులకును మంగళంబు
మకరకుండలధరనీకు మంగళంబు
మందరాచలధర శుభ మంగళంబు
పుడమివల్లివేసు పురాఢ్యభూరియశము
సుదతిసరసాంబరత్మకా శోభనంబు॥ 105.

సీ॥ లాలిమన్మథరూప లాలిసత్కులదీప
లాలివివాహ వినీలదేహ
లాలిలోకాధార లాలిశుభాకార
లాలికనకచేల లీలబాల
లాలిఖండితవాలి లాలిదయాశాలి
ఖరదూషణకులాళి హరణకేళి
లాలిరావణనాశ లాలిహృషీకేశ
లాలిభవవిభంగ లక్షణాంగ

గీ॥ లాలిలక్ష్మణాగ్రజ సీతలోలలాలి
లాలిబుధనుత సద్గుణశీలలాలి

లాలిశ్రీవల్లి వేద్పుర పాలలాలి
లాలినరసాంబనుతనీకు లాలిలాలి 106.

సీ॥ అతిభక్తినరసాంబ యనునామెచెప్పిన
సీసముల్ విబుధులు చిత్తగించి
యతిగణప్రాసంబు లెఱుఁగనినాతప్పు
లెంచకమీరు మన్నించరయ్య
ఏజనులైనను నెపుడునీశతకంబు
భక్తితోవ్రాసిన బఠఁగఁజదివి
వినినవారలకెల్ల విహితార్థహితబుద్ధి
యాయురారోగ్య భాగ్యములువంశ
వృద్ధియగునట్లు హరివరంబిచ్చుగాత
మెంతయుశుభాతిశయములు హెచ్చుగాత
ముర్విఁవళ్ళివేడు పురమందుండునట్టి
వరదరాజులకృపచేత నరులకెపుడు॥ 107.

ఓం.

శ్రీ కోదండరామచంద్రాయనమః.

# వరదరాజసంకీర్తనలు.

సీ॥ శ్రీవిఘ్నరాజ నేఁజేయువిన్నపములు
మదినుంచివిఘ్నముల్ మాన్పుమయ్య
ముక్కంటిపట్టినా మ్రొక్కెడిమ్రొక్కులు
కనులారఁగనినన్ను గావుమయ్య
గజముఖనీకృతుల్ గానంబుచేసెద
వీనులారఁగనీవు వినఁగదయ్య
మూషకవాహన ముందునిన్ సేవింపఁ
గొఱలేకపనులొనఁ గూడునండ్రు

గీ॥ సిద్ధవరులనురక్షింపఁ జెలఁగినీవు
భువిశిలాపురంబందునఁ బొందుగాను
దాసులొనరించు నతుల ముదముగనంది
గరిమ వరసాంబఁబ్రోవుమా గౌరిపుత్ర ॥

## విఘ్నేశ్వర కీర్తన.

రూపకము—భైరవి.

పల్లవి.

శ్రీపార్వతివరనందన సేవించెదబుధచందన

అనుపల్లవి.

నాపాపములనుబాపుము నాపైఁగరుణనుజూపుము ॥శ్రీపా॥

చరణములు.

లంబోదరగజముఖ ఫాలాంబకసుత మిమ్మేఁగనిరి
అంబుజాసనాదులునన యంబునభీష్టములమనిరి ॥శ్రీపా॥
మూషకవాహానభక్తుల దోషములనుడుడిచి సం
తోషుఁడనై నన్నేలిన దోషరహితుఁడందురునిను ॥శ్రీపా॥
శిలలపురనివాస దేవ సలలితమృదుభాషరావ
చిలువలజం దెముధరించి చెలువుగనరసాంబనేల ॥శ్రీపా॥

## సరస్వతి ప్రార్థన.

సీ॥ వాణిపుస్తకపాణి వనజసంభవురాణి
గీర్వాణి బంభరకేశవేణి
బాలేందుముఖిపుష్ప బాణునగ్రజాసఖి
వికచాబ్జనేత్రి పవిత్రగాత్రి
ఇంతియానవిజిత దంతిదేహసువర్ణ
కాంతిసౌందర్య భాగ్యములదాంతి
అంబవాక్సతిశారదాంబ ధాతపదాబ్జ
భృంగసత్సాంగాంత రంగనిలయ

గీ॥ ధాతవా తెరనుండెడి ధన్యవీవు
విష్ణు దేవునికోడలా విద్దప్రోఢ
భారతీనిన్నునామదిఁ బ్రస్తుతింతు
నంతరంగంబులోనుండు మమ్మెప్పుడు ॥

## కీర్తన రూపకము.

### శ్రీరాగము.

వనజాసనవనితానిను గొనియాడినవినవేలనె
అనయముమనమునవేఁడిన వినఁజాలవొ కనఁజాలవొ
మనఁజాలనె నన్నుబ్రోవవె ॥వన॥
వణీలోచన పల్లవపాణీ యళినీలవేణి
వీణాపుస్తకపాణీ పాణీశుకవాణీ గీర్వాణీయజురాణీయో
॥వన॥
సారసదళనేత్ర సరసాంబస్తోత్రపాత్ర
శారదసితగాత్రశ్రుతి సారామలశాస్త్రాదిక సారాఖిల
వాగ్విలసని ॥వన॥

## విఘ్నేశ్వర స్తుతి.

### భైరవి.—రూపకము.

రారావిఘ్నేశ నను రక్షింపుముభవనాశ
రారాగిరిజాకుమార రామేరుసమానధీర
ఏరానాదోసములను వేగమెతునుమాడినీవు
రారారావేసివీడఁ బోరానీపాదమాన ॥రారా॥

## సరస్వతీ స్తుతి.

అంబాయిటురావె శారదాంబా నను బ్రోవవే
అంబుజాక్షుఁగూడిరావె యంజలిగా వింతునీకు
గంభీరంబుగ వీణను దంబురఁదాళము మీటుచు
జంభారివినుతనాహృదయంబున నుండంగ వేగ ॥అంబా॥

## కృష్ణ స్తుతి.

మాధవయిటు రారా నా మనవిని చేకోరా
యాదవకులభూషణనే నీదరిఁ జేరితిని ప్పుడు
వాదభేద మేలయ్యా యశోదతనయ మేలాయిది
మోదమలర గరుడు నెక్కి మోహనాంగిలక్ష్మిఁ గూడి
॥మాధవ॥

## శివస్తుతి.

కింకరజనములఁ బ్రోవను బంకజాక్షసఖుఁడటంచు
వంకరదైవముల వేఁడి వాంఛల నేనడుగఁ బోను
శంకరనిను నెఱనమ్మితి శర్వాణినిగూడినాదు
సంకటములఁ ద్రుంపుము నర సాంబ నురక్షింపుమనుచు
॥రారా॥

## కీర్తన ఆది.

(అరెనయ్యావలె)

రారగోపాల రక్షించుసురపాల
ఇటురమ్మా యదువంశబాల

ఘోరకలుషనిర్మూల కాంచనచేల
సిరివరభక్తపాల కరుణించకున్న మేల
కరిపాల విడఁజాల యీజాల మిఁకనేల ॥రార॥
మానవాధీశ మంజులమృదుభాష మణిభూష దనుజవిశోష
మనసిజవేష మామణిపోష
మానకకావ్యశ్రీశ మర్యాద జగదీశ !
మునితోష మోహినివేష హృషీకేశ సర్వేశ ॥రార॥
వాసవమిత్ర వామనచారిత్ర వసుదేవదేవకిపుత్ర
పశుపతిస్తోత్రపాత్రి పావనచరిత్ర
పద్మాలయకళత్ర నరసాంబనుతపాత్ర
సుచరిత్ర సురమిత్ర మునిస్తోత్ర మోహనగాత్ర ॥రార॥

## నామావళి — సావేరి.

వరములియ్యవమ్మ వారిజాక్షినీవు వనజాసనుని వనితనేను
గోరు ॥వరము॥
భక్తితోడనిన్ను బాడువాగలకు ముక్తినిత్తువమ్మ మోహ
నాంగినీవు ॥వరము॥
సుందరాంగియరవింద నేత్రనీకు వందనంబులిడెదెందమలరఁ
గోరు ॥వరము॥
గురులక్ష్మనాథు కోడలైననీవు నరసాంబవాక్కు మెఱ
పించిసాక్కు ॥వరము॥

## లక్ష్మీదేవి ప్రార్థన.

సీ॥ క్షీరసాగరపుత్రి వారిజాయతనేత్రి
వనజాసననుత పావనసుగాత్రి
నీలనీరదవేణి నిరుపమకల్యాణి
తరుణాబ్జపాణి దైత్యారిరాణి
చంద్రబింబానన చంద్రునిసోదరి
కుందకుట్మలదంతి కోమలాంగి
హరివక్షముననోల లాడుచుండెడుబోఁటి
పచ్చవిల్తునికన్న పద్మగంధి
గీ॥ కలిమిబలిమినినోన గూర్చుకంబుకంఠి
గిరిజవాణులతోనాడు సరసిజాత
నీకుసాష్టాంగదండంబు నేనొనర్తుఁ
గరుణనన్నేలుకొనవమ్మ కన్నతల్లి ॥

కీర్తన—రూపకము ఫీల్.

ఏమనినేవిన్నవింతు నిందిరాదేవీజననీ
సోమునిసోదరివి కరుణఁజూడవేలనే జననీ ॥యేమని॥
మానినినీవిపుడునన్ను మఱచితేలనే జననీ
దీనపోషణియింకనాకు దిక్కులేరుగా జననీ ॥యేమని॥
చాలఁగానేవేఁడినాను జాలమేలనే జననీ
పాలవెల్లి పట్టినాచే పట్టిప్రోవవే జననీ ॥యేమని॥
సరసిజదళనేత్రినిన్ను సన్నుతించెదజననీ
నరసాంబపూజితా ఆనందదాయకిజనని ॥యేమని॥

## నామావళి ఆదితాళము.

### శ్రీరాగము.

ఆదిలక్ష్మినీ వాదరింపవమ్మ భేదమెంచి తెనామీఁదభరింప
లేను ॥ఆది॥

ఆదివిష్ణువక్షమందునుండు శ్రీద సాధుసజ్జనులను సంతసింపఁ
జేయరాద ॥ఆది॥

కోమలాంగినీకుఁగోపమేలనాపైఁ గామితార్థమిచ్చికావు
నాకుఁ బ్రాపుగాను ॥ఆది॥

సరసిజనేత్ర సద్ధర్మచారిత్ర శరనిధిపుత్రి నరసాంబ స్తోత్రపాత్ర ॥ఆది॥

### పార్వతి ప్రార్థన.

సీ॥ శాంభవిచాముండి శర్వాణిశుకవాణి
చంద్రబింబానన చంద్రమౌళి
హైమవతీకాళి యంబయుమాపర్ణ
సావిత్రియాపావన స్థత్రినేత్రి
ధూర్జటిదేవేరి ధూమ్రాక్షసంహారి
నిత్యమంగళకారి నిర్వికారి
బగళకాత్యాయని భైరవిమోహినీ
త్రిభువనపాలన దివ్యమూర్తి

గీ॥ హరికిసోదరి మహిషాసురాంతకారి
సింహవాహనమెక్కెడు శీతనగజ
వ్యాఘ్రచర్మాంబరధరు నర్థాంగినీకు
దండమర్పింతునమ్మ వేదండయాన ॥

## గౌరిప్రార్థన.

### కీర్తన — ఆదితాళము.

### కమాస్ రాగము.

గౌరినినునేగొనియాడుదు ననుఁగరుణఁజూడు కాత్యాయనీ
యంబ కారుణ్యశృంగారగాత్రి ధారుణీధరసుపుత్రి ॥గౌరి॥
శంకరినామదిలోని సంకటముల్ పాపుమని పొంకముగావేఁడిన
నీ కింకనుదయరాదెజనని శంకరునిరాణివమ్మ ॥గౌరి॥
పన్నగభూషణురాణి పల్కువెపన్నగవేణి చిన్మయమూర్తిని
నినుసేవించెదఁగల్పవల్లి శ్రీపతిసోదరివితల్లి ॥గౌరి॥
ఇందుధరసుందరినా డెందమునందుండగనె నిందలునీకొందు
నఛే నిరతమునినువేఁడునట్టి నరసాంబనేలుచేపట్టి ॥గౌరి॥

## బ్రహ్మదేవుని స్తుతి.

చం॥ కపటముగాదువాణిధవ! కావుదయారసముంచినన్నునేఁ
జపలతనున్నదానమతి శారదనంపి క్షమింపకుండినన్
అపకృతిగాదెనీవుసురులందునఁ బేరువహించుటెట్లు? వి
ష్టపముననన్ను నేలినయశంబగు శ్రీహరిరుద్రులందునన్ ॥

## విష్ణుస్తుతి.

ఉ॥ వారిజనాభనీచరణవారిజముల్ స్మరియించిముందటన్
వారిజసంభవాదిమునివంద్యులు ధన్యులునై రటంచునే
వారునువీరుదెల్పఁగను వాంఛితదాయకుఁడౌదువంచునో
వారిజనేత్రనీకిపుడు వందనముల్ పొనరింతుమాధవా॥

### కీర్తన — ఆదితాళము.

### ధన్యాసిరాగము.

శ్రీధరయనుకొనుమీ దామోదరుగనుగొనుమీ మనసా
॥శ్రీధర॥

వేదతతికంబనిభేదంబెంచక సాధుజనంబులసంగతివిడువక
॥శ్రీధర॥

కలిమిగలిగెననిగర్వముఁజెందక కులవిద్యలుబలముల పెం
పొందక ॥శ్రీధర॥

సతిసుతహితతతిసకలవిభవములు సతమనిమదిలోసంతో
షింపక ॥శ్రీధర॥

పరధనంబులకుఁబరుగులువాఱక పరదారల సౌందర్యముగో
రక ॥శ్రీధర॥

హరిభక్తులపై నాగ్రహముంచక పరులసంపదలఁబరిగొని
ముంచక ॥శ్రీధర॥

అనవరతమునరసాంబనుమనిచెడు జనార్దనుఁడుభవజాడ్య
వైద్యుఁడని ॥శ్రీధర॥

## కీర్తన—ఆదితాళము.

### బేగడ.

పూజచేసెదఁబురుషోత్తముని నే ॥పూజ॥

పూజచేసెదను పుణ్యమునుగోరి
జాజిపూలతోను జానకీజానిని ॥పూజ॥

రాధానాథుఁడైన యాదిదేవుఁడైన
వేదవేద్యుడైన సాధుపోషకునినే ॥పూజ॥

సరసిజాక్షునిన్ను నరసమాంబచెన్ను
మెఱయఁజేయుచున్న స్మరణమనెడుపూల ॥పూజ॥

### ఈశ్వరస్తుతి.

శా॥ కైలాసాద్రినివాసనీసఖముఁదాఁగాంక్షించిభ్రాంతాత్మనై
శైలాత్మోద్భవవేఁడ నిచ్చితివియుష్మద్దేహమర్ధంబునా
కాలీలన్ భవనాశనంబగున మోక్షానందమిప్పించిత్వ
త్పాలంబెక్కఁగఁజేయుమయ్య కరుణాకూపారయేపారఁ
గ॥

### కీర్తన రూపకము—ఫీల్.

కైలాసనివాసనన్ను గరుణజూడరా దేవా
శైలజాపతినీకునాపైఁ జలములేలరా దేవా ॥కైలాస॥

చంద్రభాస్కరాగ్ని నేత్ర చంద్రశేఖరా దేవా
యిందరి దేవతాదివినుత యిందువేగరా దేవా ॥కైలాస॥
పన్నగభూషణుఁడనాకుఁ బ్రాపునీవెరా దేవా
చెన్నుగానా చెంతఁజేరి చింతదీర్చరా దేవా ॥కైలాస॥
శంకరానీభక్తులకును గింకరుండరా దేవా
నా సంకటములు ద్రుంచుటకును సమయమిదేరా దేవా
॥కైలాస॥

నారదతుంబురగాన నాదవినోదా దేవా
నారాయణసఖుఁడప్రోవు నరసమాంబను దేవా ॥కైలాస॥

ఉ॥ కంటిని గోపురంబు కళకంఠనివాసముఁ జేరి కన్నులన్
గంటినివ్యాఘ్రచర్మధరుఁ గంటిహరున్ గిరిజామనోహరున్
గంటినిశంభునీశు శితికంఠుఁద్రిశూలుని భస్మధారునిన్
గంటినినాగభూషణుని గంటిశివున్ బొమమీదిచూపునన్॥

ఆంజనేయ కీర్తన.

రూపకము భైరవి.

అనిలజనీపదములకును నంజలిచేసెదనుగొనుమ
పనిగొనినను రక్షింపను ఘనమా విసుమా హనుమా య
నుమానించకప్రోవుము ॥అనిల॥

ఇనసూనునిసచివుఁడవై యినజాగ్రజుఁబరిమార్పను
ఇనవంశజుఁబ్రార్థించిన పనివాఁడని వినుతించెద జనుదేరు
ము ననుబ్రోవుము ॥అనిల॥

అవనివిభుఁడుపత్నికొఱకు నంగుళీయమంపనీవు
ప్లవగంబులతోడఁగూడి యావసిధిని నానలికిని రావలంబ
ముగదాఁటిన ॥అనిల॥

సురవైరిపురమువెదకుచు సుదతినిగనిమదినలరుచు
నరపతిముద్రికనొసంగి నాతిసేమమెల్లఁదెలుప
కరునలినుతనీఘనమును సురలెల్లను వినుతింపఁగ
ధరశాశ్వతయశమొందితి నరసాంబనుతార్తరత ॥అనిల॥

సూర్యస్తుతి.

చం॥ దినకరనీవుసత్యమను తేజముచేసురప్రార్థితుండవై
దినములుసేయుచున్విమతి ధీరులద్రుంచుచుదీనపాలనన్
దనరిత్రిలోకయామిపయి ద్వాదశకాంతులలోకబాంధవుం
డనఁదగిసస్యవృద్ధికరుఁడైనప్రభాకరనీకుమ్రొక్కెదన్ ॥

కీర్తన.

రూపకము హరి కాంభోజి.

ఉండేదిమాధవుఁడొక ఊరక చెడిపోకెమనస ॥ఉం॥
అండపిండాండబ్రహ్మాండ భాండమెల్లనిండి ॥యుండేది॥
శూన్యుండై స్థూలుండై సుస్థిరుఁడై పూర్ణుఁడగుచు
మాన్యుండై జగమెల్లను మానకరక్షించివెల్గు ॥చుండేది॥
చంద్రభాస్కరులుతనకుఁ జక్షులై వర్తింపనలువ
నందనుఁడుగనరసాంబనింపొందఁగరక్షించివెల్గు ॥చుండేది॥

## కృతి.

### ఆదితాళము బిలహరి.

రారనందయశోదబాల రాధారుక్మిణిలోల ప్రోవఁగ ॥రార॥
రారమ్మనినీ పేరునఁబిలిచిన మేరానన్విడ సాగసనేత్రుఁడ
వారిజనాభుఁడ ॥రార॥

బాలకృష్ణుఁడ జాలమేలర చాలనమ్మితిరా
వేలగోపికలోలనందుని బాలయిఁక జా, గేలరనేతా, శర
విడఁజాలర ॥రార॥

ఇందువదనుఁడ కుందరదనుఁడ మందరధరుఁడ
అందమగునర విందాంఘ్రులకిదె నందనములో యిందిరన
దనా యిందువదన యిటు ॥రార॥

నారదార్చిత నాగతల్పక సరసమాంబనుత
వారిజాసనవందితరఘు వీరనాయెడ విరసము సరసము పరు
సముఁజూపక ॥రార॥

## కీర్తన.

### ఏక తాళము రాగము—బ్యాగ్.

(హేవినాయకా)

బాలకృష్ణుఁడ గోపాలకృష్ణుఁడ
కాలయవనజరాసంధ కంసజిష్ణుఁడ ॥బాల॥
నీలశ్యామల వర్ణ పాలితాఖిల నీ

పాలఁబడితినేలుటకిఁక జాలమేలరా ॥బాల॥
సుందరాకార గోప నందకుమార నీ
యందమైనపాదములకు వందనములురా ॥బాల॥
ఎంతో వేఁడిన నీకుఁ బంతమేలరా ఈ
పంతమెల్లవిడిచి దయను బల్కవేమిరా • ॥బాల॥
దీనురాలరా దిక్కు లేదురా యో
దానవహర నీవెదిక్కు గానఁ బ్రోవరా ॥బాల॥
సరసిజోదరా విశ్వాఖిలోదరా శ్రీ
నరసమాంబహృదయమందు మెఱయుచుండరా ॥బాల॥

క౦॥ రారాయని నేఁబిలిచిన రారాదా నీకు నింత రాజసమేలా
యేరా భక్తులవిడుచుట మేరా రఘువీర యింత మేలం బేరా॥

కీర్తన.

ఆటతాళము ఆనందభైరవి

శ్రీరామా నను బ్రోవరాదా నాకోరినకోర్కెలఁగడ తేర్ప రాదా
వారిజనాభ నీమీఁద భక్తి వాంఛగల్గి వేఁడువనితనేఁ గాదా ॥శ్రీరా॥
ఎంత వేఁడినగాని నీవు నా చింతదీర్పుమటంచుఁ జెప్పినరావు
వంతమాపల్కకున్నావు ముందు నెంతటివారల నేలియున్నావు ॥శ్రీరా॥
రాక్షసాంతకలక్ష్మిలోలా నాకు నీక్షణంబున వచ్చి మోక్షమీవేల

ఆక్షేపణము నేయ మేలా నేను సాక్షి పెట్టి నిన్ను సాధింతుఁ
జాల ॥శ్రీరా॥

కరినిగాచినవాఁడవంచు నిన్ను పరిపరివిధముల వలచి
ప్రార్థించు

నరసాంబపై నెనరుంచు శ్రీమన్నాథ సత్కీర్తిపోనాడక
గాంచు ॥శ్రీరా॥

కీర్తన.

ఆదితాళము—సావేరి.

ఇనకులేశసామి యిందురావదేమి మనమునందునను
మాన మేమొనీకు ॥యినకు॥

సారసాక్షునిన్ను గోరిపిల్వగాను
మారుపల్కలేని మాన మేమొగాని ॥యినకు॥

దాసులరక్షింప గాసియొంచు నెంచి
మోసగించి యెచట మూలదాఁగినావొ ॥యినకు॥

యిట్టివాఁడవని యెఱిఁగినిన్ను బుధులు
పట్టివారిమదిని గట్టివేసి రేమొ ॥యినకు॥

నరసాంబఁబ్రోవ నాథుఁడీవెగాని
పరిపూర్ణభావ పరమాత్మదేవ ॥యినకు॥

శా॥ లక్ష్మీనాయక నీవు నాపయిని వాల్లభ్యంబుతోఁ బావముల్
అక్షీణోద్ధతి ద్రుంపనీపదము లే నశ్రాంతముల్ నమ్మితిన్
రక్షింపన్ మఱినీవెగాక ప్రభువీ బ్రహ్మాండమందెవ్వరే
పక్షీంద్రున్ వడినెక్కి వచ్చియిఁక నాపక్షంబునందుండవే॥

## కీర్తన.

రూపకము—ఆనందభైరవి.

నీటుసేయమాటరాహరీ ననుబ్రోవకిట్లు ॥నీటుసేయ॥
నీటుసేయనీభక్తుల కూటములనుజాటించెద
నేటికిమీాబోటికింత మాటగలుగ మంచిదగునె ॥నీటుసేయ॥
నీలవర్ణ నీగుణములు నిరతమునేనుతియింపఁగ
ప్రాలుమాలిబదులుపలుక(జాలవౌనన్నెలనింత॥నీటుసేయ॥
లక్షింపఁగనీకన్నను రక్షింపనుబరులెవ్వరె
పక్షీంద్రునినెక్కివచ్చి యీాక్షణమునఁబ్రోవకిట్లు॥నీటుసేయ॥
నాపాపములను(బాపఁగ నోపన్నగశయననీవు
ప్రాపనుచునునినునమ్మితి శ్రీపతిరక్షింపకిట్లు ॥నీటుసేయ॥
పరివారలు శ్లాఘింపఁగఁ బరిజనములువినుతింపఁగ
నిరతము నిను నెఱనమ్మిన నరసాంబనుబ్రోవకిట్లు॥నీటుసేయ॥

## నామావళి.

ఆదితాళము—కాపీ

వేళయిదేరా వేణుగోపాలా ఆదరించినాబాధలుమాన్పఁగ
కోమలదేహానాకోటకదీర్చరా సామజపాలన ప్రేమఁజూ
చుటకు ॥వేళ॥
మందరోద్ధార సుందరాకారా సందియమేలర సాధులఁ
బ్రోవఁగ ॥వేళ॥
నందకుమారా నవనీతచోరా అందునిందునరసాంబను
బ్రోవఁగ ॥వేళ॥

క౦॥ వరదాయననీవిదుగో ! యరుదెంచితిననఁగరాదె ? యబ్జ
వినేత్రా ।
సరియనికరుణించినచో సరివారలలోననీకు స్వల్పంబగునే?

## కీర్తన.

### అటతాళము—ముఖారి.

వరదాయనినిన్ను వర్ణించుచుండగ వచ్చిచూడరాదా నా
మదిఁగల్గు వాంఛఁదీర్చరాదా ॥వర॥
కరివరునేలిన సిరివరుఁడనినిన్ను మఱిమఱివేఁడిన మానమే
లరభక్త ॥వర॥
ఇందిరాపతినిన్ను వెయ్యారువిధముల నెంచుటవినవేలా
ననువిడచుటానందమ జయశీలా
ఎందఱోభక్తులసందడిచేమఱచి యుందువో యిదినీకానం
దమటరశ్రీ ॥వర॥
అండపిండాండబ్రహ్మాండభాండములెల్ల నిండినరఘునంద
నా యాదవకులమండన సంక్రందనా
అండజవాహన కుండలిశయనవే దండరక్షకనాయండ
నుండవెభక్త ॥వర॥
వాసవార్చితస్వప్రకాశవై కుంఠపురీశా యిటురావా నర
సాంబను భాసురంబుగఁగావా
దోషరహితజగదీశా నీదాసుల మోసముచేసినదోసమయ్యా
భక్త ॥వర॥

నామావళి—ఏకతాళము.

వరదరాజవరములివ్వ వేమినాసామి ద్విరదరాజునిమ్ము వేఁ
డఁ గరుణతో రక్షింపలేదె ॥వరద॥
దశరథసుతదయతో బ్రోవ రాదా నాతో వాదా
పశుపతిసఖపద్మనాభ పాకశాసనాదివినుత ॥వరద॥
నిరతిశయవి నిర్మలాంగ రావా నన్ను బ్రోవ
పరమపురుషపంకజాక్ష పన్నగేంద్రశయన వేగ ॥వరద॥
నారదతుంబుర గానవిలోలా వరసాంబగావు
నారాయణనందతనయ నగధరహరినరకేసరి ॥వరద॥

ఉ॥ అక్కటనన్ను గావఁగలయాప్తులుబంధులు లేమిఁ జేసియే
దిక్కును లేక శ్రీహరియె దీనులపాలిటి దేవుఁడంచు నే
నిక్కమునమ్మి నీచరణ నీరజముల్ మదినుంచిభక్తిమై
సొక్కుచు వేఁడుపల్కు చెవి సోఁకని దేమిపరాకు రాహరీ॥

కీర్తన.

ఆదితాళము—ధన్యాసి.

మాధవననుగరుణించరా నామనవియొకటియాలించరా
యాదవకులపాథోధిచంద్ర నన్నాదరించనీకేదయరావలె
॥మాధ॥

మున్ను ధ్రువునిరక్షింపవా యప్లే మొన్నకరినిమన్నింపవా
నన్ను బ్రోవనీకన్న దైవముల నెన్నఁబోనునాకన్నులానహరి
||మాధ||

ఎంత వేఁడినరావుగా నా చింతదీర్పకున్నావుగా
పంత మేలనీయంతవారలకుఁ గంతుజనక నా చెంతనుండి
యిఁక ||మాధ||

నందగోపకుమారుఁడా నరసాంబఁబ్రోవునుకుమారుఁడా
మందరధరిగోవిందనాయెడను సందియ మేలరసారసనేత్రుఁడ
||మాధ||

నామావళి.

ఆదితాళము—బ్యాగు.

మాధవరారా మౌనములేలర మోదముతో నాకు మోక్ష
ములీయఁగ ||మాధ||

గోపాలవీరా గుణగణహారా గోపికలోలనా పాపముఁబా
పఁగ ||మాధ||

భావజాకారా పాపసంహారా కావరారమేరు ధీరగంభీరా
||మాధ||

పరమపురుషవర పంకజలోచన నరసాంబనుత నందసుపుత్ర
||మాధ||

కం|| రక్షించుదీనురాలను శిక్షించుచుదోషములను శ్రీభూవర

నాకీక్షణమెకోర్కులొనఁగి కటాక్షించుచు నాదుచేవిడ
కుమమురారీ॥

కీర్తన.

ఆదితాళము—ఆనందభైరవి.

విడువనురా రామా నీపాదపద్మముల విడువనురా రామా
వడుగవై బలిని మూడడుగులడిగికొల్చి
పుడమిక్రిందికి దైత్యునడచిన పాదముల ॥విడువనురా॥
సీతనుగాళింగునిం గర్వమడఁచుచు
మేటిగనాడిన మీపాదపద్మముల ॥విడువనురా॥
అవనిజకొఱకు మున్నడవితిరిగిబడలఁ
బవనజుఁడొత్తిన పాదపద్మములను ॥విడువనురా॥
కంబుకంఠులుగోపి కలఁబోలిభక్తినర
సాంబచేఁబూజల నందినపాదముల ॥విడువనురా॥

ఆదితాళము—కన్నడరాగము.

నాపేయిపీడన్యాయమా రామయ్య నీచరణంబులనెఱనమ్మి
యుండ ॥నా॥
నిన్నుగోరినేను నిరతముపూజింప నన్నుబ్రోవనీవు కన్నడ
సేయుచు ॥నా॥
దిక్కులేనిదాన దేవనిన్నుమాన మక్కువనునీవునిక్కముగఁ
గావు ॥నా॥
సారసనాభుండ సాధుపోషకుండ నారదనుతుండ నరసాంబ
పోషకుండ ॥నా॥

కం॥ నందునినందననీ నర వింధద శాత్ములనుగూడి విబుధులు
మెచ్చక్
బృందావనినిజరించిన సుందరధరమూర్తినీకు శోభనము
హరీ॥

కీర్తన.

అటతాళము—ఆనందభైరవి.

నందనందనాయిందురా వేలభక్త బృందపాలనయింతచేమేలా
మందరోద్ధర భక్తులందఱునుతియించు నందడిచేమఱచియుందు
వో నన్నుబ్రోవ ॥నం॥
మున్నుద్రౌపదిసభచూడంగ మానమునుదీయ నినుగోని
యాడంగ
చిన్నికృష్ణానీవు చెలువకప్పుడువల్వలెన్నొయొసఁగినావన్నది
నిజమైన ॥నం॥
ఘోరమైనట్టి క్రోధముఁబట్టి పుత్రికుని బాధింపఁగ స్తంభమునఁ
బుట్టి
కోఱలుగలిగిన ఘోరసింహంబవై క్రూరదానవునష్టు గూల్చినది
నిజమైన ॥నం॥
సురనరలోకాధిపరిపాలా ధర నరసమాంబనుబ్రోవుమీవేళా
సిరితోడనీవేగి నరగమకరిఁద్రుంచి కరినాథునేలిన బిరుదునిజం
బైన ॥నం॥

నామావళి—ఆదితాళము.

నందనందానన్నలుదేవా పశుబృందపాలనగోవిందుఁడా యా
నందుఁడా

ముచికుందవరద నవకుందరదన రాకేందువదన మునిచందన
నంద ॥నంద॥

బాలుఁడై చోరుఁడై గోపాలుఁడై జారుఁడై
బాలుఁడుదుడుకని రోలనుగట్టిన మేలుగమద్దులఁ గూలఁదన్ను
యదు ॥నంద॥

ఇందురా రఘునందనా కందురా నేమందురా
మందరధరనీ సుందరాంఘ్రులకు వందనములు నింపొందఁ జేతు
యదు ॥నంద॥

సిరివర మొఱలిడ సరియేరా బిరబిరఁ
గరివరుఁగాచిన కరుణనువిప్పుడు పరువడినరసాంబను బ్రోవుము
యదు ॥నంద॥

ఉ॥ శ్రీహరినీదుమూర్ధమునఁ జెన్నలరారఁగిరీటమున్ రహిన్
బాహువుపురుల్ విమూల్యమణిభవ్యసుహారములున్ వెలుంగ
నీదేహమునన్ సువర్ణపట దీధితులొప్పఁగవైన తేజుసద్
వాహనుఁడౌచుఁగన్పడి కృపన్ ననుఁబ్రోవుము శ్రీర
మాధవా॥

కీర్తన.

ఆదితాళము — కాపీ.

రావా రాఘవా దేవా నినునమ్మిన దీనులఁబ్రోవా ॥రావా॥
రావా నేనీ సేవఁ జేసెద నీవాఁకొర్కెల నినకులతిలకా ॥రావా॥
ఎంత వేఁడిననేలరావు నీయంతవారలకుఁ బంతమేలహరి॥రావా॥

కంతుజనక శ్రీ కాంతవిభుఁడనా వంతలఁగలిగిన చింతదీర్పఁగను
రావా॥

వరకిరీటమును మకరకుండలాల్ కరకంకణములు కాంతిచెలం
గఁగ॥రావా॥

సురవరులును గిన్నరులును బొగడఁగ సిరితోఁగూడుక మురిసిన
వేఁడుక ॥రావా॥

వారిజాప్తకుల వారిజనాయెడ నేరమెంచనేనెంతదాన హరి
॥రావా॥

వారిజాక్షునరసాంబకుఁగోరిక లూరనోసఁగఁబరివారమెసఁగని
టు ॥రావా॥

## కీర్తన.

### అటతాళము—బ్యాగ్.

(ఈరమ్యనగరమే)

మాధవయదుకులపాథోధిచంద్రమ శ్రీదేవిహృదయాబ్జభృం
గనన్నాదరించుదయాంతరంగా దీనసాధుపోషక శోభనాంగ
భవవిభంగ ॥మాధ॥

సుందరరూప వసుంధరాధిప పశు బృందపాలన యిందురారా
యరవిందలోచనప్రోవవేరా సురవందితనీకు మ్రొక్కెదరా
అరివిదారా ॥మాధ॥

పరిపరివిధములఁ బ్రార్థనచేసినఁ బరమపూరుషపల్కవేలా
యింతయరమరచేయుటమేలా ప్రోచు బిరుదందినట్టిగోపాల
జాలమేలా ॥మాధ॥

నరమృగరూపవా నరభూప పరితాప హారణపరాత్పర నీవు
సాధువరులనుగాపాడినావు అట్లు నరసాంబను వేగప్రోవు
మేలబిగువు ॥ఓమాధ॥

నామావళి.

ఆదితాళము—సురట.

రారా బాలగోపాల నన్నేల జాగుతేలరా వేగ ॥రారా॥
ఎంతో వేఁడినానురా నీచెంతనుజేర్చుకోరా వేగ ॥రారా॥
చాలనమ్మినానయ్యా యింత చలమేలప్రోవవేగ ॥రారా॥
సరసీజనేత్రరారా నరసాంబనుగాచుటకు వేగ ॥రారాబాల॥

కీర్తన.

ఏకతాళము ఆనందభైరవి.

ఏరాగోపాలపల్కవు నీదయఁజిల్కవు మాతేమియంటినయ్యా
మానమేలరా ॥యేరాగోపాల॥
సురేంద్రపాలనన్ను దయఁజూడకుండిన సరేమునీంద్రులెల్ల
నిన్నుజౌకచేతురు ॥యేరాగోపాల॥
నరేంద్రవినుతనీకు నింతపరాకేలరా

కరీంద్రప్రణుతనీవునన్నుఁ గరుణఁజూడరా ॥యేరాగోపాల॥
నరసాంబఁ బ్రోవ నీకింతయరమరలేలరా
కరుణాకరమూర్తివి ప్రేఁగంటఁజూడరా ॥యేరాగోపాల॥

కీర్తన.

అటతాళము—కాపీ.

హాస్యముగాదుకాదు ఆర్యులతోనువాదు ॥హాస్యము॥
మోసముచేయరాదు దోసముకాకపోదు ॥ధర॥
భాసురంబుగఁబరమభక్తుల భంగపఱచెడుపరమలోభుల
దూసికత్తులనాలుకలు దెగఁగోసి వేతురు యమభటులు
॥హాస్య॥
ముద్దులకృష్ణ లేరా ముందుగనిందురారా పద్దులునీకునేలా
వద్దురనందబాల
సద్దుసేయకనీవుగొల్ల ముద్దియలకడఁ జేరివెన్న
ముద్దలను మెక్కుచును దాసులయొద్దఁ జేరకయుండుటిది
॥హాస్యము॥
సామజపాలరారా సాఁగిలిమ్రొక్కినారా ప్రేమనుజూడవేరా
నేమనలేనుధీరా కామితార్థములిచ్చిమును నిష్కాములను
గడతేర్చినట్టిస్వామినా మొఱవినకనీమది ప్రేమదప్పియుండు
టిది ॥హాస్య॥
సారసనేత్రనీవు సాధులఁబ్రోచినావు నారదవంద్యనేఁడు
నరసమగృపఁజూచువారిజాసనవందితా సరివారిలోఁబరిహాస
మేలర సారెసారెకుదలఁపనీవిటు తేరతేరకుఁజూచుటలు
॥హాస్యము॥

## కీర్తన.

### ఆదితాళము తోహరా.

కృష్ణానిర్మలయాదవకుల వర్ధిష్ణాననుబాలించరా
తృష్ణనుదగిలిదిక్కెఱుఁగక చింతించెదనది తొలఁగించరా
॥కృష్ణా॥

సంసారంబనునబ్ధిమునీఁగినే సరిగనీఁదగాలేనురా
హంసగమనజనక నీదునామంబనునావనుదాఁటించరా
॥కృష్ణా॥

కమలోదర మోహాంధకారమునఁ గనులుగానకున్నానురా
అమరవినుత నీజ్ఞానాంజనమున నమితదోషములఁ బాపరా
॥కృష్ణా॥

ఈక్షణమున నాకభయమిచ్చుటకు నిందిరేశకృపఁజూడరా
పక్షివాహనంబెక్కివచ్చి ప్రత్యక్షంబుగరక్షించరా॥ కృష్ణా॥
అరమరలేలరభక్తులఁబ్రోచెడు నాదిపురుషుఁడవునీవెరా
॥కృష్ణా॥

నరసాంబనుబ్రోషింపను గ్రక్కున నందనందనా వేగరా
॥కృష్ణా॥

## నామావళి.

### ఆదితాళము సురటి.

కృష్ణానన్నేలుకోరా యశోదబాల ॥కృష్ణా॥
కృష్ణాయనుచుఁదొల్లి కృష్ణ వేఁడఁగనీవు
కృష్ణమావల్వలిచ్చి కష్టముతీర్చితివఁట ॥కృష్ణా॥
దుష్టులారాక్షసుల నష్టపఱచిధర
నష్టభార్యలను నిష్టమతిఁగొన్నావఁట ॥కృష్ణా॥

మాధవసన్ను బ్రోవరాదా కాననీ చేతఁ
గాదాయానాఁడు కరిఁగాచినవాఁడవఁట ॥కృష్ణా॥
అందముగను నరసాంబవందితమున్న
మందరమెత్తిసుర బృందముఁగాచితివఁట ॥కృష్ణా

కం॥ హరిహరియని మొఱపెట్టిన సిరిసంగడిచేతనీకుఁ జెవులం జొరదో
సరిసరిభక్తులఁ బ్రోచుట కరుదా పెక్కనుసేలవా ? మును దేవా॥

కీర్తన.

రూపకము—భైరవి.

తరమగునేనినుబొగడఁగ దామరసభవాదులకును
గరినుతింప సిరినివిడిచి పరిజనులను పరిహరించి
పరుగునీకుభ్రాంతియేమొ భక్తుఁబ్రోచు మహిమనెంచ ॥తర॥
బాలకుఁడౌ ప్రహ్లాదుఁడు బాధితుఁడై వేఁడఁగొనిన
కాలరుద్రువంటి నరమృగంబగునీరూప మహిమ ॥తర॥
సరునిపత్ని సభలోపలఁ బరిభవపడి పాహియనఁగఁ
దఱుగనివల్వలనొసంగి తరుణినిరక్షించుమహిమ ॥తర॥
పరిపూర్ణదయారసమున వరసాధులదరిఁజేర్చుచు
నరసాంబనురక్షించెడు నారాయణనామమహిమ ॥తర॥

## కీర్తన.

ఆదితాళము—ఆనందభైరవి.

బ్రోవరా నన్ను భూమిజామనోహర భూవరసుకుమార
రావామాధవనీదు సేవఁజేసెదనాదు భావమెఱిఁగినా
భవబంధములను దెగఁగొందిగ్రక్కున ॥బ్రోవరా॥
దంతివరుని గావలేదా శ్రీకాంతదీనులఁబ్రోవరాదా
ఎంతవేఁడినఁగా నుంతవినవునాతోఁ బంతములేల
భగవంతుఁడయిఁకనా చింతలుదీర్చి ॥బ్రోవరా॥
అసురశిక్షకసుశ్లోక ఓఅరవిందనయనపరాకా
పశుపతిమిత్రనా పాపములనునెడఁ బాపినీనిజమైన
రూపుఁజూపిదయ దోఁపజేయుమిఁక ॥బ్రోవరా॥
పరమపురుషనాతోఁబల్కవా యెంతో బ్రతిమాలినదయఁ
జిల్కవా
అరమరలేలర సిరియురధరహరి నరసాంబమనమా
నందమునొందగ నుండిచెంతను ॥బ్రోవరా॥

## నామావళి.

ఆదితాళము—శుద్ధబంగాళ [తాలినేఁజేసిన]

హరినేఁ జేసిన దురదృష్టంబో దురితంబులనెల్ల దొలఁగింపలే
రా ॥హరి॥
నాసరివారలు నవ్వగనెవ్వగ రోసమునీసును బాసిపోలేదే
॥హరి॥

ఎంతో వేఁడిన నిడుమల బాధ కొంతైన నను బోఁగొట్టఁగ రాదా
॥హరి॥

సారసాక్షసరసాంబకృతంబు క్రూరమే మొయింత కొఱఁతవి
ధంబు ॥హరి॥

## కీర్తన.

ఆటతాళము కాపీ.

తగునా మాధవ ననువిడనాడ ॥తగునా॥

జగతి భక్తజనములఁ బ్రోవఁగ ఖగగమనుఁడవునై దయా
మతి

మగువచిల్కఁగ మొగినిబల్కఁగ సొగసుగుల్కక రాకయుం
డుట ॥తగునా॥

సుందరంబగు నీపదములకు వందనంబొనరింతు నెప్పుడు
కుందరదనా నన్ను బ్రోవఁగ సందియంబుగనుంట నీకిది
॥తగునా॥

దుఃఖమను నరకాబ్ధిలోఁ బడి దిక్కు తెలియక నేను వేఁడిన
మక్కువను రక్షింపఁజాలక చిక్కులఁబడఁ ద్రోయ నీకిది
॥తగునా॥

ఎన్నివిధముల వేఁడినను ప్రసన్నుఁడవుగాకున్నవాఁడవె
చిన్నికృష్ణా నిన్ను నమ్మిన నన్ను మోసముచేయ నీకిది ॥తగు॥
మారకోటిసమానసుందర సారసోదరసత్యరక్షణ
నారదవరద యనుచు వేఁడెడి నరసమాంబను విడువ నీకిది
॥తగునా॥

## కీర్తన.

ఆదితాళము—కమాసు (కాంభోజి)

ఏలయిటు రావయ్య రఘువీరా జానకిలోల ॥ఏలయిటు॥
మేలనుచు నీదుసేవ వాలాయముగ నేఁ జేయ జాల మేల నాపై
మాసిపాలయీవేళ నన్ను ॥నేల॥
నీలమేఘశ్యామా నన్ను నేలకున్న నీదాసులు
గేలిసేతురయ్య జాగు లేల శ్రీదశరథపాల ॥ఏలయిటు॥
మందరధరణ యేలాఁటి సందేహము నాయందు లే
దెందుకు రక్షింపవో నేనెఱుఁగను దేవా
కుందరదన నీసేవలందె ప్రొద్దుపుచ్చు నాపై
మందె మేల మేల నీకు వందనములొనర్తు దేవా ॥ఏలయిటు॥
సామజనాథునిపైన ప్రేమగల్గుటను భక్తి
లేమ జీరియెఱుఁగ లేక పామరంబునఁ
గామితార్థమిచ్చు దాసుల ప్రేమఁ జూడవే నిన్ను
దామసంబుచేత వారు నీమానంబెల్లఁ దీసెదరు ॥ఏలయిటు॥
సారసాక్షనిన్ను వేఁడి వారిజాసనాదులెల్ల
సారెకు సాయుజ్యపదవిఁ జేరినారఁట
వారిజనాభ నిన్నెపుడు కోరిదలఁచుచున్నయట్టి
నారదాదిమునులవలెను నరసమాంబఁ బ్రోచుటకు ॥ఏలయి॥

## కీర్తన.

ఏకతాళము దర్బారురాగము (నీసమానమెవ్వరు.)

మోక్షమిమ్ము మోహనాంగ మోసమేలర భవభంగా
దక్షకులెవ్వరు శుభాంగ ధర్మసంగ ఖగతురంగ ॥మోక్ష॥
వేణుగానలోలనన్ను వేగమెరక్షించుమన్న
కరేణునాథుఁ బ్రోచుటెన్ను కృపను సంరక్షితాపన్న ॥మోక్ష॥
ఎట్టిదీనులైనఁ గాని యేలుట మర్యాదపూని
అట్టిబిరుదుఁ గైకొని యిట్టులెతి వేభూజాని ॥మోక్ష॥
సారసాంబకయిటు రారా సారెకుఁ గొనియాడినారా
ధారునినరసాంబహృద్విహారక సుందరాకారా ॥మోక్ష॥

## కీర్తన.

రూపకము—కాంభోజి (బిలహరి).

ఇంతచలమేలరా రామా నను బ్రోవఁగ నీకింత ॥చలమేల॥
ఎంతో వేఁడినఁ జెంతఁ జేరినా చింతలనిఁక దొలఁగించుట ॥కింతచల॥
ధరణిభారము మాన్పనెంచి దశరథసుతుఁడై జనించి
హారునియంబకంబుఁ ద్రుంచి యవనిసుత వరించి మఱచి ॥తింత॥
తల్లివరము దీర్పనెంచి యిల్లువిడిచి వనిఁ జరించి
కల్లరిదానవిముక్కును కర్ణములు ఖండించితి ॥వింతచల॥
మారీచువధించి సీత మార్గము గానక తపించి
సూరసుతుని పరిచర్యల సోలి వాలి నేలఁ గూలిచి ॥తింతచల॥

అవనిజానిలార్కసుతము ఖాన్వితుఁడై లసదయోధ్య
జవముమెఱయఁ జేరినవర సాంబవరద సన్నుతింపఁగ॥నింతచల॥

## కీర్తన.

అటతాళము (రాముఁడేనాపంచప్రాణము.)

ఇష్టదైవము కృష్ణుఁడేనా కష్టదిక్కులుసాక్షిగ
దుష్టగుణములద్రుంచినామది నిష్టములనొనఁగూర్పఁగా ॥ఇష్ట॥
ఇందిరేశామునులహృదయము లందుఁజిక్కితో యీశ్వరా
వందనంబిడిమునులకును నీబంధనమువిడిపింతురా ॥ఇష్ట॥
కామశరబాధితలుగాయదు కాంతలేసినుబట్టిరా
స్వామివిడుచుటధర్మమనియా సఖులనేఁప్రార్థింతురా ॥ఇష్ట॥
సరసిజాక్షుఁడుసకియరుక్మిణి సరసనుండెడినెప్పుడు
నరసమాంబనుమనుపనామెకు నతులొనర్చెదనిప్పుడు ॥ఇష్ట॥

## కీర్తన.

ఆదితాళము—ముఖారి.

ఏమనివినుతింపుదు యదువంశతిలకానే నేమనివినుతింపుదు॥
సామినిన్ను వేఁడ నామజేంద్రుఁడెగాని యోమహనీయమూర్తి
నామనమందుననిన్నేమని
ఇందిరరమణదే వేంద్రునకొఱకుముఁ
మందరమెత్తు గోవిందనీమహిమనే ॥నేమని॥
హద్దుమీఱితివనినిఁ బద్ధునిజేయుజనని

మద్దులఁగూల్చిన ముద్దులకృష్ణుని ॥న్నే మని॥
నందనందన నరసాంబనుబ్రోచునా
నందము నేఁడునా డెందమునందున ॥నేమని॥

నామావళి.

ఏక తాళము శంకరాభరణము. (జోగి)

రామచంద్రుఁడా నన్నుబ్రేమఁజూడరా
సామజేంద్రపాలనాపైఁ జలము లేలరా ॥రామచంద్రు॥
స్వామియిందురా నిన్నే మనందురా
కామితార్థమిచ్చినన్ను గరుణజూడరా ॥రామచంద్రు॥
కోపమేలరా నాకోర్కెదీర్చరా
తాపసమందార నాకుఁబ్రాపునీవేరా ॥రామచంద్రు॥
ఇందువదనుఁడా యరవిందనయనుఁడా
నీ సుందరమగుపాదములకు వందనములురా॥ రామచంద్రు॥
అమరవినుతుఁడా విమలచరితుఁడా
నరసమమకు మోక్షమొసఁగు నాగశయనుఁడా ॥రామచం॥

కీర్తన.

ఆదితాళము— మోహన.

శ్రీశా పరమేశా ననుగావవేమిరా
కావవేమిరా గడతేర్చవేమిరా ॥శ్రీశా॥
నిన్నెగానియన్యదైవ మెన్నఁబోనురా

నేనెన్నఁబోనురా నీకన్న లేరురా ॥శ్రీ॥శా॥
ఇందిరేశసుందరాంగ వందనములురా
వందనములురా యరవిందనయనుఁడా ॥శ్రీ॥శా॥
సన్నుతించువారినెల్ల మున్నుబ్రోవరా
మున్నుబ్రోవరా యిఁకనన్ను గావరా ॥శ్రీ॥శా॥
నాగశయననిన్ను నెపుడు నమ్మియుండెడి
నినునమ్మియుండెడి నరసాంబఁబ్రోవుమా ॥శ్రీ॥శా॥

## కీర్తన.

### అటతాళము—ముఖారి.

ఇదియేమాశ్చర్యము నేనెఱుగనియింత కఠినహృదయము
మదనజనకదీన సదనానీపదమాన సుదతినమ్మినదాన వదలు
టసరియేనా॥

విదితముగనాహృదయమందున వరలకయనీపదములందిన
ముదితనై మోహంబుఁజెందినఁ బదవినొసఁగక మఱపునొం
దిన ॥ఇదియేమా॥

దంతావళనాయకపాలన మకరాంతకఫలదాయకా
అంతరంగమునని న్నెంతోవేఁడినభక్తు లంతానీపదముల
చెంతఁజేరిరంచు

నెంతవేఁడిననీమనంబున నింతకఠినంబేలగలిగెనో
పంతములువిడనాడినాతోఁబల్కవాదయఁజల్కవా॥నేఁడిదియే॥
ఎట్టినోములునోచితిఁ బూర్వమున నే నిట్టిజన్మమునెత్తితి

కట్టడినీపదముఁబట్టకుండినని(క గట్టాయెవ్వరికాళ్ళు పట్టుదు
శ్రీహరి

పట్టువదలకునన్ను దేవకి పట్టినీపదపద్మములనే
బట్టితినిభవబంధమెల్లను నెట్టు మనదయఁజూడకుండుట॥ఇదియే॥
కోమలాకారరావా నేఁగోరినకోర్కెదీర్పకావా
సామజనాథుని బ్రేమఁజూచిననాఁడై స్వామినా మొఱవినవేమి
సేయుదునయ్యో
కామితార్థంబిచ్చిభక్తుల నేమమునరక్షింపకుండిన
సోమసుందరనిన్ను దాసులు ప్రేమదప్పనటందురయ్యో ॥ఇది॥
వారిజనాభరారా నీపదములకువందనములిదేరా
వారిజాసనమునివందితనామీఁద నేరములెంచిన నేనోర్వఁజాలను
సారసాక్షుఁడనిన్ను నెప్పుడు సారెసారెకుఁబిలుచుచుండెడి
ధీరనరసాంబికనుబ్రోవఁగ సాహసంబిఁక నేలనయ్యో ॥ఇదియే॥

కీర్తన. రూపకము—యదుకులకాంభోజి.

సారసాక్షనే నిఁజూడక భరింపనా దరింపుమిఁక
స్మరించెదను బరాత్పరుఁడ ॥సారసాక్ష॥
సుందరమగుమోమిం పొందఁగఁజూపిననా
నందంబునడెందంబున వందనమిడి పూజింతుర ॥సారసా॥
శరణంబంటినిరా కరుణనుజూడుమురా
స్మరియింతును బరమెంతును మొఱవినరా కమలోదర
॥సారసాక్ష॥
నరహరియనివేఁడు నరసాంబనునేఁడు
చేపట్టుర యీపట్టున నేఁబట్టితి నీపదముల ॥సారసాక్ష॥

## నామావళి.

### ఆదితాళము—బ్యాగు.

ఏమిర శ్రీకృష్ణా యేమంటినామీఁదఁ గోపమా
కోపమా తాపమా పాపమా నాయందు ॥యేమిర॥
సుందరాకారుఁడ నావందనములనెల్ల డెందమందుంచనిది
అందమా చందమా మందమా నేనోర్వ ॥యేమిర॥
బాలగోపాల యీజాలమునీకేలరా చాలునునన్నేల
చలమా మేలమా వైళమా నాయందు ॥యేమిర॥
కరిరాజరక్షక కంసాదిశిక్షక నరసాంబరక్షింప
సరసమా విరసమా పరుసమా యీవేళ ॥యేమిర॥

కం॥ మాధవయీధరలోనా కాధారమునీవటంచు నాత్మ నెఱిఁగినే
మోదంబుననుతియించెద శ్రీధరరక్షింపుమయ్య శ్రితమందారా॥

## కీర్తన.

### రూపకము—భైరవి.

మాధవయిటురావా నామనవినిచేకోవా
యాదవకులభూషణనే నీదరిఁజేరితిఁ బ్రోవను ॥మాధవ॥
వనమాలశృంగారా నామనవినివినవేరా
మునిజననుతదివిజార్చిత మనమునసంకోచమూడ్చి ॥మా॥
సామగానలోలనను బ్రేమఁజూడవేలా
సామాన్యమెనీమహత్వ సత్వములసనంగవేగ ॥మాధవ॥

అంబుజభవజనకా నరసాంబనుగృపగొనక
జంభారిసురలనుబ్రోవ సంద్రమునవర్షంబుశేవ ॥మాధవ॥

కీర్తన.

ఆదితాళము—ధన్యాసి.

బాలకృష్ణనీమహిమంబులుతగ భజియించెదస్వామి
చాలనమ్మితిని నీపదాబ్జముల సామగానలోలా దయఁ
జూడుము ॥బాల॥

వనజనాభనినునెఱిఁగినుతింపను వనజాసనువశమె
వినయముగనునిను వినుతించెదనా మనమునందురక్షణ
మొనర్చుమని ॥బాల॥

అజ్ఞానంబనుచీకటిలోనే నంగలార్చఁజాల
సుజ్ఞానంబను నీనామాక్షర సూక్తినిచ్చిమన్నించెదవనిశ్రీ
॥బాల॥

మందరధరనాపై నీమదిలో సందేహంబేలా
నందపుత్రయానందమునొందుచు ననవరతమునరసాంబ
నేలుమని ॥బాల॥

కీర్తన.

అటతాళము—కాపీ.

బాలకృష్ణానీపదంబులు భక్తితోభజియింపఁగాఁ గనవేల
రా తాళజాలరా ॥బాలకృష్ణా॥

ముందుభక్తుల నేలినావని యెందఱో పొగడంగ నేవిని
యుంటిరా నిజమనుకొంటిరా ॥బాలకృష్ణా॥
మాటిమాటికి నిన్ను బిలిచిన మాఱునాతోఁ బల్కకున్న
మాటరా యిదినీపూటరా ॥బాలకృష్ణా॥
గోపబాలకనన్ను గావను జ్ఞాపకములేకుండుటిది నా
పాపమా మనస్తాపమా ॥బాలకృష్ణా॥
నరమృగేంద్రానిన్ను నమ్మిన నరసమాంబను బ్రోచు నేరుపు
నేరవా యిందుఁ జేరవా ॥బాలకృష్ణా॥

## కీర్తన.

రూపకము—ఆనందభైరవి.

నన్ను బ్రోవరావదేమిరా గోపాలకృష్ణ నిన్ను నమ్మియు
న్నదాన వాఁడరా
కన్నతండ్రి నీవేయని యెన్నుచు నే వేఁడితిరా మన్ననతో
నిపుడుఁ జూడు
వెన్నుఁడ యాపన్నుల ప్రసన్నుఁడ నాకన్నులఁబడి ॥నన్ను॥
ఇందువదనకుందరదనుఁడా కందర్పకోటి సుందరాంగ
గరుఁడగమనుఁడా వందనంబుచేసెదనర విందనయననీపద
ముల యందు మనసుగలిగి చాల నిందునను నానందింపుము
వందింతును నందింతును ॥నన్ను॥
గోపబాలకొదువలేలరా నను బ్రోవనీకుఁ గోపమేల పాపసం
హరా రేపుమాపుజరిపినఁగా పాడక నేనోపలేను

దాపపనుందారనీవె

దాపనుచును బ్రాపనుచును నేప్రొద్దును నెదనమ్మితి
॥నన్నుబ్రోవ॥

సిరిపతానీసరియె యెందును నరసాంబకోరు వరములీయ
ధరణి

యందును కరివరుఁగాచిననాఁటి కరుణఁజూపవేనినిన్ను
బరిహాసింతురయ్యమునులు

సురవందిత నరకేసరి పరిపూరిత కరుణాకర ॥నన్నుబ్రోవ॥

కీర్తన.

అటతాళము శంకరాభరణము.

రక్షించరార శ్రీరంగా నాకు నీక్షణంబున మోక్షమీవే
శుభాంగ ॥రక్షించ॥

భిక్షకురాలపై బిగువింతయేలా పక్షివాహనమెక్కి పద్మ
తోఁజాలా ॥ రక్షించ ॥

దీనపోషకనాకు దిక్కునీవేగా దానవాంతకభూతదయ
యునీదేరా ॥ రక్షించ ॥

పాపాత్మురాలనఁబనిలేమదేవా ఆపద్బాంధవ బిరుదాంకుఁ
డవుగావా ॥ రక్షించ ॥

పారసనేత్రనరసాంబకునేఁడు కారుణ్యరసముపైఁగారఁగ
జూడు ॥ రక్షించ ॥

## కీర్తన.

రూపకము కీరవాణి.

హరిదాసుల బ్రోచుటనీ కరుదా కరివరదా శ్రీ ॥హరిదా॥
చిరకాలపుస్థితిధ్రువునక మరనొసంగినవరముదలఁప ॥హరి॥
పగవారలఁబాండవసతి పరిభవపడిమిము వేఁడఁగ
ఖగగమయక్షయపటములఁ గరుణనొసంగినవాఁడవు॥హరి॥
దనుజుఁడు తనయునిమీఁదను దయలేకయు దండింపఁగ
మనుజసింహరూపముగొని దనుజబాలుబాలింపవె ॥హరి॥
నరసురవరగరుడవియచ్చరగణముల రక్షింపవె
నరసాంబనుమాత్రమునా కరణిఁగరుణఁజూడరాదె ॥హరి॥

## కీర్తన

అటతాళము బేగడ.

భక్తవరులను బాధపఱపకమీ ఓ చిత్తమా హరి ॥భక్త॥
భక్తవరులను బాధపఱచిన రక్తిలేనిదురాత్మకుండని
(త్మ్మరాలని)
కత్తిచేఁగొని కాలుఁడేనీకుత్తుకను దెగఁగోయుఁడే హరి ॥భక్త
దాయలను జెఱుపంగఁదలఁపకుమీ దయలేక చెఱచినఁ
దామె చెడుదురు తలఁచిచూడుసుమీ

దాయయగు ధర్మజుని చెఱుప నపాయమతి దుర్యోధనుఁడె
చెడె
మాయదెలియక రాముశరమున మహినిగూలఁడె మున్ను
వాలియు ॥భక్త॥
సాధుజనులకు భేదమెంచకుమీ ఓచిత్తమా హరి
పాదపద్మము లాశ్రయించుసుమీ
సాధువని ప్రహ్లాదు నెన్నక బాధపఱచి హిరణ్యకశిపుఁడు
క్రోధముననరసింహుచేతను మేదినింబడెననఁగవినవె॥భక్త॥
పరసతులఁగని పరిభవింపకుమీ ఓచిత్తమా హరి
చరణములనెల్లప్పుడు మఱవకుమీ
పరసతులమదిఁగోరినరకాసురుఁడు ప్రాణముఁగోలుఁపోవఁడె
నరసమాంబహృదబ్జమందున మెఱయుచుండెడి హరిని
నమ్మిన ॥భక్త॥

కీర్తన.

రూపకము కల్యాణి.

కల్యాణముఁజూడరారె కన్నులలర శ్రీకృష్ణుని ॥కల్యాణము॥
ఇల్లాలాయెనువిదర్భ వల్లభసుతవైభవముగు ॥కల్యాణము॥
మణిమయమగుపీఠంబున మకరకుండలాభరణుఁడు
మణినిభరుక్మిణిగళమున మాంగల్యము గట్టునట్టి ॥కల్యా॥
పచ్చలహారతులుగొల్ల పణఁతులుగుమిగూడియెత్త
సచ్చరితుండగు కృష్ణుఁడు సఖరుక్మిణికేలువట్టు ॥కల్యాణ॥
రంభాదులుదివమునసంరంభంబుగ నాట్యమాడ
జంభారిసురాదులునర సాంబయుఁగీర్తించునట్టె ॥కల్యాణ॥

కీర్తన.

ఆదితాళము ధన్యాసిరాగము.

ఇందిరామనోహర యీవలెనాకిష్టార్థంబులను
మందరధరముచికుందవరద గోవిందుఁడనీకిదె వందనంబుశ్రీ
॥ఇంది॥

బాలకృష్ణనీమహిమంబులుగన బ్రహ్మకైన వశమా
చాలవేఁడనేఁజాలజాగులిఁక నేలనేఁడు శ్రీలోలా ప్రొముక్కెద
॥నింది॥

నన్నుగాచిరక్షింపమఱెవ్వరె నాగరాజశయనా
నిన్నెగాని నేనన్యమెఱుఁగరా వన్ననాకునీవన్న వాంఛి
తము ॥లింది॥

సారసాక్షునా మొఱవినివిననటు లూరకుండుటేలా
నేరమేమిచేసితినీయెడఁగరుణారస మొల్కఁగ నరసాంబకుఁ
దన ॥యిందిరా॥

కీర్తన.

రూపకము ఫీల్.

వేఁడికొన్నరావదేమి వేణుగోపాలదేవా
పాడిదప్పివీడనీకు భావ్యమేచాల ॥వేఁడి॥
పంతమాపల్కవునాతోఁ బన్నగశయనా దేవా
చింతలెల్లదీర్చినీదు చెంతఁజేర్చరా దేవా ॥వేఁడి॥

నిన్నెగానియన్యదైవ మెన్నఁబోనురా దేవా
కన్నతండ్రివి నీవెనన్ను గరుణఁజూడరా దేవా ॥వేఁడి॥
నరహరీగానవినోదా నందకుమారా దేవా
నరసాంబనుబ్రోవనీకుఁ దరుణమిదేరా దేవా ॥వేఁడి॥

నామావళి.

ఆదితాళము బేగడ (బిలహరి.)

వినుతించెద నిందిరావిభుని నేఁడు ॥వినుతించెద॥
అనుదినమును నినువేఁడినాను ననుగావుమంచునాపాలిసా
మి నేఁడు ॥విను॥
సుందరాంగుఁడరవింద నేత్రుఁడంచు వందనంబుచేసినంద
నందనుని నేఁడు ॥విను॥
స్వచ్ఛవేదములఁద్రుచ్చుదుష్టుద్రుంచు మత్స్యమూర్తిగోడు
మాన్పునంచువాని నేఁడు ॥విను॥
కుంభినినినరసాంబకోరికొన్న శంబరారిఁగన్నస్వచ్ఛమైన
శౌరినెన్న ॥విను॥

కీర్తన.

ఆదితాళము (నిన్నునమ్మియున్నవాడరా)

నిన్నునమ్మియున్న దానవాఁడరా శ్రీరామచంద్రా
॥నిన్నునమ్మి॥
నిన్నునమ్మియున్న (దాన) వాఁడరా నన్యదైవములఁగాన
మన్ననతోనన్ను బ్రోవరా శ్రీరామచంద్రా సన్నుతింతు
మున్ను వేగరా ॥నిన్ను॥

రెండవయుగమందుఁ బ్రచండులైన రావణాది
దండిరక్కసుల ప్రబాధచే శ్రీరామచంద్రా ధరణినెల్లవెతలు
పొందఁగా శ్రీ ॥నిన్ను॥

అసురులచే సురులు భీతులగుచునిన్నుఁ జేరివేఁడ
నాసురుల మొఱాలకించితి శ్రీరామచంద్రా భాసురముగ
నాదరించితి శ్రీ ॥నిన్ను॥

సురలనెల్లధరణినివా నరులై దగఁబుట్టుడంచు
సరవితోడ వరములిచ్చితి శ్రీరామచంద్రా ధరణిభారమా
పఁజొచ్చితి శ్రీ ॥నిన్ను॥

ధరనుదశరథునకునీవు తనయుఁడవై తనరఁబుట్టి
యనుజులతోఁగూడియుండఁగా విలసిల్లినావు జననీజనకులు
రహింపఁగా శ్రీ ॥నిన్ను॥

అవనిని విశ్వామిత్రుఁడు సవనావనమునకు వేఁడ
నువిద తాటకను వధించితి శ్రీరామచంద్రా యురుశిలను ల
తాంగిఁ జేసితి శ్రీ ॥నిన్ను॥

అరయజనక సభనుజనము లద్భుతంబునొందనీవు
హరునివిల్లువిఱిచి గ్రక్కున శ్రీరామచంద్రా యవనిజఁ
బెండ్లాడి ముదమున శ్రీ ॥నిన్ను॥

పరశురాముభంగపఱచి భార్యఁగూడికొనియయోధ్య
పురికినట్టేచేరినాఁడవు హితులుబుధుల్ పురజనులు సంతసిం
పఁగా శ్రీరా ॥నిన్ను॥

జననివరముఁదీర్పనీవు జనకజననుజన్ముఁగూడి
వనములలోఁదిరిగినాఁడవు అచ్చటగల మునుల కభయ

మొసఁగినాఁడవు శ్రీ ॥నిన్ను॥

వాసిగాశూర్పణఖనిన్ను వలచిరతికివేఁడదాని
నాసకర్ణములఁదీయించితి ఆకారణమున దూషణాదులను
ద్రుంచితి శ్రీ ॥నిన్ను॥

దానవుమారీచునణఁచి ధారుణిజనుఁగోలుపోయి
కాననమునవెదకుచుండితి నామీఁదహనుమఁగంజహితుని
సుతునిగాంచి శ్రీ ॥నిన్ను॥

కీశనాథునొక్కకోలఁ బీచమణఁచియినతనూజుఁ
గీశపదవి కధిపుఁజేసితి నతికరుణతోడఁ జూచితనకుఁదారఁ
గూర్చితి శ్రీ ॥నిన్ను॥

రంగుగహనుమంతుఁబంచి రామగాంచిరమ్మటంచు
అంగుళీయకంబుపంపఁగా శ్రీరామచంద్రా చెంగుననతఁ
డబ్ధిదాటఁగా శ్రీ ॥నిన్ను॥

అతివలంకిణీవధించి యచటవెదకిసీతఁగాంచి
పతిముద్రికనామెకొసఁగియు శ్రీరామచంద్రా నతియొసం
గురత్నమందియు శ్రీ ॥నిన్ను॥

వనము వెఱికిరాక్షసాళిఁదుని మిరావణునకు భీతి
జనకముగాలంకఁగాల్చుచు శ్రీరామచంద్రా వెనుకఁదిరిగి
వనధిదాఁటుచు శ్రీ ॥నిన్ను॥

వచ్చిప్లవగనాథుఁడంత వనితక్షేమమెల్లఁదెలుప
నుత్సహించికట్టి వారధి నాజలధిదాఁటి యొనరలంకముట్ట
డించితి శ్రీరామ ॥నిన్ను॥

దోషయు కరావణాది దుర్జయుల జయించియుటవి
భీషణునకులంకనిచ్చితి దైతేయజనిత భీతిఁదప్పసురులఁ
గాచితి శ్రీరామ ॥నిన్ను॥

సీతయగ్నిఁజొరఁగసత్య పూతయనుచుఁ జెట్టబట్టి
నీతమ్ములనితోవిలాసిదై సంతోషమొనఁగ నిఖిలహితులఁ
గూడి భాసిమై శ్రీ ॥నిన్ను॥

కాంతసీతఁగూడిపుష్ప కవిమానమెక్కి వేడ్క
నంతటనయోధ్యఁజేరితి శ్రీరామచంద్రా యనుజుభరతు
నాదరించితి శ్రీ ॥నిన్ను॥

జనములెల్లసంతసింప జనకజానుజన్ములతో
జనులుపొగడరాజ్యమేలితి శ్రీరామచంద్రా వనితనరస
మాంబ నేలితి శ్రీరా ॥నిన్ను॥

నామావళి ఆదితాళము.

రారశ్రీరామ శీఘ్రమెననుబ్రోవఁగ రాక్షసభీమా ధరా
ధీశుఁడవేగ ॥రార॥

వారిజనాభవిస్తారయశస్కర ప్రారంభశీలా శీఘ్రమెనను
బ్రోవఁగ ॥రార॥

కోమలాంగపరంధామవిరోధిసం గ్రామవిభేది శీఘ్రమెనను
బ్రోవగ ॥రార॥

వీరాధివీరస మీరకుమారనుత కారణకార శీఘ్రమెనను
బ్రోవఁగ ॥రార॥

నరసాంబవందిత నారాయణాచ్యుత కరుణావిలసిత శీఘ్ర
మె ననుబ్రోవఁగ ॥రార॥

కం॥ ఎల్లప్పుడునీవేనాతల్లియుఁదండ్రియును గురువు దైవంబనినా
యుల్లమునసమ్మియితరము నొల్లక సేవింతుఁబ్రోవు మో
జగదీశా.

కీర్తన.

అటతాళము—రాగం ముఖారి.

రారె శ్రీహరిభక్తులారా మనమెల్ల శ్రీరాధావిభునిఁజూతాము
కోరికదీరఁగోరి పూజలుచేతాము
సారసాక్షుఁడుజగతిలో భూభారమునుదీఱు చుటకొఱకై
కోరి దేవకిగర్భమందునఁ గొమరుఁడై జన్మించెనఁటయిఁక
॥రారె శ్రీహరి॥

బాలుఁడై పాపసంహారుఁడయ్యెయశోదపాలుఁద్రాగినాఁడఁటా
శీలుఁడై నవనీత చోరుఁడై యదువంశ పాలుఁడై భక్త
మందారుఁడై పూతన కాలుఁడై కంసాది దుష్టవిదారుఁడై
కందర్పజననీ లోలుఁడై సుకుమారుఁడై సురపాలుఁడగుముని
లోలుఁడితఁడఁట ॥రారె॥

దిట్టఁడై నందునిపట్టి శకటాసురుఁ గొట్టిమెట్టినాఁడఁటా
ఉట్టిమీఁదనువెన్న చట్టిఁగొట్టఁగఁదన్ను బట్టితల్లియురోటఁ
గట్టివేసెనఁట ॥రారె॥

గట్టుపైగోపికలుపెట్టిన పుట్టములుగొని చెంతనుండిన చెట్టు
మీఁదను
బెట్టిచేడెలు పెట్టుమ్రొక్కులకలరినాఁడఁట ॥రారె॥
గిరిభేదిదెగడొందఁగొనవ్రేలితోఁ బెద్ద గిరిని నెత్తినాఁడఁట

అరమరలేకబృందావనంబునఁదాను నావులఁగాచుచునానం
దించెనఁట ॥రారె॥

అరుదుగాఁదుంబురుని వీణాస్వరమువినిబలు సంతసించుచు
నరసమాంబనుబ్రోచినట్టి నలువజనకుండీతఁడేనఁట ॥రారె॥

ఉ॥ పుట్టితిభూమిలోననొక పుణ్యమెఱుంగభీతచిత్తనై
పట్టితినీదునామమను పావనఖడ్గమునాకరంబునన్
గొట్టితిఁగాలకింకరులఁ గూలఁగఁజేసితిశత్రులార్వురన్
గట్టితినామనంబునను గంజదళేక్షణనీపదంబులన్ ॥

కీర్తన.

రూపకతాళము — భైరవి.

ఏవేళనునేవేఁడిన నెందుకుహరిరాఁడోయిటు
ఈవేళనుహరిధరపై నెందుండునో లేకుండునో ॥ఏవేళ॥
ప్రముచ్చుసోమకునిద్రుంచను మత్స్యంబై చనెనో
హెచ్చగుమందరముమోయ కచ్ఛపమైచనెనోయిటు॥ లేవేళ॥
హేమాక్షువధించియఖిల భూమినిలుపఁజనెనో
హేమకశిపునణఁచిభక్తు నేలుటకటుచనెనోయిటు ॥లేవేళ॥
వామనుఁడై బలిదైత్యుని నేమరింపఁజనెనో
భూమిపతులఁదునుమఁబరశు రాముఁడగుచుఁజనెనోయిపుడే
॥లేవేళ॥

ములువంటిదశాననాది ఖలులగూల్పఁజనెనో
బలరామానుజుఁడైయదు భామలకడఁజనెనోయిపు ॥డేవేళ॥

కరముత్రిపురంబులఁ జెఱుపఁగ హరుతోఁడుగఁ జనెనో
కలికిరూపమున భక్తుల కడకుఁ గావఁ జనెనో యిపు ॥దేవేళ॥
ధరనువల్లివేదుపురము మఱపై యెటుచనెనో
నరసాంబనుగడ తేర్ప జనార్దనుఁడు దలఁపఁడో యిపు ॥దేవేళ॥

మత్తకోకిల.

రక్షకుండని నమ్మినాను రామచంద్ర రమాధవా
దక్షులెవ్వరు లేరు నిన్విడ ధారుణీస్థలిలోపలన్
బక్షివాహన మెక్కి గ్రక్కున బాధమాన్పఁగ వచ్చి ప్ర
త్యక్షమైననునుద్ధరింపుమ యాదిదేవ దయానిధే॥

కీర్తన.

రూపకము—భైరవి.

రాఁడా నేఁగొని యాడిన రక్షింపను రామవిభుఁడు
ఈఁడా యిష్టార్థములనునినవంశజుఁ డీవేళను పన్నగవిశ్వా
మిత్రుని
జన్నముదీర్పఁగ జవనామన్ననను సహల్యఁ బ్రోవమానకతా నేగి
నాఁడో ॥రాడా॥
అనుజునితోఁ గూడుకొనుచు హరునివిల్లువిఱువఁ జనెనా
అవనిసుకునిభంగపఱచి యాయయోధ్యఁ జేరినాఁడ
తనయునకును రాజ్యము నీఁదగదని వాదించిన
పినతల్లివరములుదీర్ప వనములకును వెడలినాఁడ ॥రాఁడా॥

జనకునిమరణమువినితన మనమునదిగులొందినాఁడ
యనుజన్మండగుభరతుని నాదరింపుచున్నవాఁడ
మనసునునిలుపగలేకయె మానుగఁగోరినరాక్షస
వనితముక్కు చెవులుగోయు పనితీఱకయున్నవాఁడ ॥రాఁడా॥
మారీచునిదునుమఁబోయి మానకయలసినవాఁడ
నారీమణిఁగోలుపోయి యరయుచుఁదానున్నవాఁడ
మారుతిదెల్పఁగసూర్యకు మారునిపనిగొనిభూపతి
శూరునివాలినిదునుమఁగ సూర్యకులజుఁడరిగినాఁడ ॥రాఁడా॥
ధారుణిసుతవెదుకఁగాను తరుచరులనుబనుపువాఁడ
మారుతిమైథిలిసంగతి మనుతఁజెప్పవినెడువాఁడ
వారిరాశిమిన్నందగ వారించుచుఁగ్రోఁతులచే
వారధిఁగట్టించిలంక వడిగూల్పఁగనున్నవాఁడ ॥రాఁడా॥
రావణుఁదునుమాడిలంక యావిభీషణునకొసంగి
పావనిజానకికపులతోఁ బట్టణమునకపుడుచేరి
యావసిష్ఠమునులాదిగ సేవింపఁగఁగొలువుండున
యీవసుధను నరసమాంబ గావించెడిపూజలంద ॥రాఁడా॥

## నామావళి.

### ఆదితాళము—తోడి.

రామానన్నుబ్రోవరా పరంధామా దేవదేవరా
రామాకాకుత్సకులసోమా శ్రీజగదభి ॥రామానన్నుబ్రోవరా॥
దశరథబాలానీ దయరానిదేలా

పశుపతిమిత్ర నాపాపములనుబాపి ॥రామానను॥
సామగానలోలా మత్సరమునీకింతేలా
సామజపాలా యీసమయమునను వచ్చి ॥రామానను॥
కరిరాజరక్షక కంసాదిశిక్షక
సరసాంబరక్షక యరమరసేయక ॥రామానను॥

మత్తకోకిల॥ నీవు గొల్లఁడవంచునామది నెన్నుచుంటిరమున్నుమ
నున్
నీవయాదిమయుండవంచును నేనెఱింగితినిప్డిఁకన్
నీవుగాకయితఃపరంబును నెమ్మదిన్ జొరకున్న దే
యేవిధంబున నై సబంటుగ నేలరాసుగునాకరా॥

కీర్తన రూపకము భైరవి.

పరివారముగలదటంచుఁ బలుకరాకయున్నాఁడవో
సరగవచ్చియేలకున్న మా జననికిఁదెలుపఁగలనన్న ॥పరివా॥
సనకసనందాదిభక్త సదయులుగలరనియుందువో
వినయుండై ప్రహ్లాదుఁడువినుతింపఁగమఱచితో బహు ॥పరి॥
అజరుద్రులు మునిముఖ్యులు నమరులుగుమిగూడివేఁడ
గజిబిజిపడి భూప్రజలగు నిజభక్తులఁగానరావో ॥పరివా॥
నారదతుంబురులగాన నాదమువినుమోదంబున
సారసాక్షనరసాంబవిచార భజనచెవులఁబడదో ॥పరివా॥

మత్తకోకిల॥ హాటకాంబర తాటకాంతక యాహవాసురశిక్షనీ
సాటిదైవములేదటంచును జాటుచున్ భజియించుచున్

మాటిమాటికిఁ బిల్వనీవును మాటలాడవ దేలరా
మాటలాడిన నీదునోటను మానికంబులుచిందునే।

కీర్తన అటతాళము యదుకుల కాంభోజి.

రాముఁడు నామీఁదఁ బ్రేమదప్పిన దేమొ స్వామికివినిపింప
వే మాతాసీతా ॥స్వామికివినిపింపవే॥
సామజేంద్రునిమీఁది ప్రేమ నాపైఁగొంత
యీమాఱుచూపింప నెఱుఁగఁబల్కవమ్మ ॥రాముఁడు॥
పాపాత్మురాలని నీపతినామీఁదఁ గోపమొందినాఁడేమో
మాతాసీతా
శాపమొందినచానఁగాపాడినటునన్ను గావుమనుచుఁ దెల్పవే
మాతాసీతా॥ కావుమనుచుఁ దెల్పవే ॥రాముఁడు॥
మున్ను ప్రహ్లాదుని మొగినేలువానికి నన్ను మఱచుటేలనే
మాతాసీతా ॥నన్ను॥
పన్నగశబరిని పాలించినటునన్ను జెన్నుగఁజూడుమనవే
॥మాతాసీతా ॥జె॥ రా
వారిజాక్షిరో నీదు పతినినుతింపనా వశముగాదువినవే
॥మాతాసీతా నావశ॥
సారసాక్షునరసాంబను బ్రోచుట సత్కీర్తియని దెల్పవే
మాతాసీతా సత్కీర్తియని దెల్పవే ॥రాముఁడు॥

తరల॥ కరినిగాచిన భక్తవత్సల కంజనేత్రరమామనో
హార! యురంబునలక్ష్మితో విహగాధిరూఢుఁడవౌచునీ

పరిజనంబునుతింపవేడుకఁ బ్రాలుమాలకవచ్చియీ
నరసమాంబను బ్రోవ్వ గరుకు నసందనందన ప్రొక్కెదర॥

కీర్తన ఆదితాళము.

(నిన్ను నమ్మినారా నీరజ)

నన్ను బ్రోవరారా నవనీతచోరా
నిన్ను నమ్మినారా నీరజలోచనా ॥నన్ను బ్రోవ॥
సామజపాలా సమయమిదే రా
ప్రేమనుజూడ సన్మోదముతోడ ॥నన్ను బ్రోవ॥
ఇందునిభాస్యుఁడ యినసమతేజుఁడ
నందునితనయుఁడ నాగశయానుఁడ ॥నన్ను బ్రోవ॥
సురరాజమిత్ర శృంగారగాత్రా
పరమపవిత్రా నరసాంబస్తోత్రపాత్ర ॥నన్ను బ్రోవ॥

కీర్తన అటతాళము రాగం కాపీ.

ప్రోవనురారా భూమిజలోలా నీవు ప్రోవనురారా
సేవకురాలా నన్ను జేవిడచుటమేరా ॥ప్రోవనురారా॥
సొమ్ములతోఁ గిరీటమ్ము వెలుఁగ రత్నమ్ములు మెఱయఁ
బ్రేమమ్మున వేగమే ॥ప్రోవనురారా॥
అంగదాదిగఁ గపిపుంగవులనుగూడి
అంగజజనక యుప్పొంగుచు వేడుకఁ ॥బ్రోవనురారా॥
తమ్ములతోడ సీతమ్మఁ గూడి పుష్ప

కమ్మనైపై నెక్కి నరసమ్మను బ్రీతిగఁ ||బ్రోవనురారా||

కం|| ఎక్కడ హరియని జనకుఁడు
వెక్కసమున సుతుని నడుగ వే స్తంభమునన్
గ్రక్కున గనఁబడి భక్తుని
మక్కువఁ గాచిన విధమున మనుప వె నన్నున్ ||

కీర్తన శ్రీరాగము ఆదితాళము.

ప|| కనుగొంటిని కమలావిభుని నేఁడు ||కను||

అనుప|| మునుజేయు భాగ్యముల మూలమున
నన్నుగన్న తండ్రి నాపాలిస్వామి నేఁడు ||కను||

చర|| కోమలాకారుని కామసుందరుని
శ్యామలాశరీరు సామజపాలుని నేఁడు ||నను||
పక్షివాహనుని పన్నగశయాను
లక్ష్మీవక్షుఁడైన లక్ష్మణాగ్రజుని నేఁడు ||కను||
నారదాదినుతుని నవనీతచోరుని
వరసాంబ నేలు సరసిజనేత్రుని నేఁడు ||కను||

ఏలలు.

చిన్ని కృష్ణా నిన్ను మదినే నెన్నోవిధుల వేఁడినాను
నన్ను బ్రోవకున్నావదియేమి ఓచిన్ని కృష్ణా నిన్నే గాని
యన్యమెఱుఁగను ||చిన్ని||

బాలాగోపాలుడానీకు జాలమేల చాలావేఁడ
మేలనుచు నాదరింపరా ఓబాలకృష్ణా మెప్పుగవరము
లియ్యరా
వసుదేవనందననీకు వరములియ్యవశముగాదా ॥చిన్ని॥
పసులగాచుపనులుగలైనా ఓచిన్నికృష్ణా యసురవరు
లనణఁచ ॥జనినావా॥
సరసిజనేత్రుఁడనీవు సామజేంద్రుఁబ్రోచినట్లు
నరసమాంబనిపుడు ప్రోవరా నాగదవంద్య నతులొనర్తు
వరమడేలరా ॥చిన్ని॥

కం॥ వెన్నుఁడనీతోనేమని
విన్నపములు చేతునయ్య పృథ్వీజధవా
మున్నొనరుచుదోషంబుల
నెన్నకరక్షింపుమయ్య యిందిరరమణా॥

శ్రీరంజనిరాగము (భువినిదాసుడ అను మెట్టు)

భువినిభక్తుడను బుద్ధిహీనతచే బొంకులాడితిని భూమిజాధవా
॥భు॥
సవినయమ్ముగానా సరసఁజేరినీవు సత్కరింపుమయ్యా సారస
నయన ॥భు॥
కులరూపవిద్య ధనధాన్యమును సరియెవ్వరని సంతసించునా
కలుషములనెల్ల ఖండనంబుచేసి కరుణఁజూడుమయ్యా నరసాం
బనుత ॥భువిని॥

(మరుగేలరా అనుమెట్టు)

చలమేలరా ఓమాధవా చలమేలమీ చరణమేసాక్షీ కలనై
నని న్నె గానవన్యులను ॥చల॥
సిరితోడనేగి కరిగాచినట్టి బిరుదుండియింత బిడియములేల
పరివారముతో పరగవచ్చినర సాంబనేలుమయ్య సారస
నాభుడ ॥చల॥

మోహన ఆదితాళము (నన్ను పాలింప)

నా మొఱలాలించి నగుమోముచూపుము నాపాలిటిస్వామీ
కామునిగానని మోముచూచినవా కాంతులుదీరును
కాంచనచేలా ॥నా మొఱ॥

నీలజీమూత మయుమగుతనువుతో కరముల శంఖగధఖడ్గచక్ర
ములతో సలలితముగభూ తనయతోగూడి నరసాంబను
బ్రోవుము సారసనాభుడ ॥నా మొఱ॥

(ఇంతకంటెకావలెనా) రూపకము.

ఈజన్మముచాలదా నాకింతకన్న కావలెనారాము ॥ఈ॥
నా జననమెబలుకష్టము నేజన్మమునె త్తజాల ॥ఈ॥
పుట్టినయింటికిని పాదముపెట్టినయింటికినిజింత పెట్టితిలోబడిన
వారినితిట్టినాను ఈగుట్టుదెలిసి నారసాంబచెయి పట్టువదల
వలదు దేవ ॥ఈ॥

ఆది (అపరాధములు అనుమెట్టు)

పాపములనెల్ల బాఆదోలినీ దాపునుంచుమయ్యా నేజేసిన నెప
ముంచినన్ను తపియింపనేల కృపజూడుమయ్యా కువలయా
ధిప ॥పాప॥

తల్లితండ్రిగురు దైవమునీవని యుల్లమందుపొంగుచుందునర
సాంబ నెల్లకాలము పల్లవాంఘ్రులతో కొల్లలాడునట్లు
కూరిమినిజూపి ॥పాప॥

కాంభోజి—జంపె.

(శ్రీరామ జయరామ)

శ్రీకృష్ణకృష్ణయని చింతింపగామదికి సంతోషమేగదామనసా
అకళంకుడగుకృష్ణు ననయాంబుదలచినీ వానందమొందవే
మనసా ॥శ్రీకృష్ణ॥
తనయుడనియాయశోద తగముద్దులిడగ తపమేమిజేసెనోదెలి
యా తనతమ్ముడేయని తలపనారాముండు తపమేమిజేసె
నో తెలియా ॥శ్రీకృష్ణ॥
నందుండుకృష్ణుడే నందనుండనిబెంచ తపమేమిచేసెనో
తెలియా మందగలవారు మనకందతికినఖుడనగ తపమేమి
జేసిరో తెలియా ॥శ్రీకృష్ణ॥
పన్నీరుగంధంబు పైనిబూయగకుబ్జ తపమేమిచేసెనో తెలియా
నరసాంబవినుతయని నుతియింపమాలికుడు తపమేమిజేసె
నో తెలియా ॥శ్రీకృష్ణ॥

## మంగళహారతులు.

### కీర్తన రూపకము శ్రీరాగము.

మంగళంబునిత్యము రఘుపుంగవునకు సౌమిత్రి కి
నంగనమణియగు సీతకు నంజనిసుతునకు

||జయజయమంగళం||

అనుజన్ములు తనుగొల్వఁగ వనచరులునువినుతింపఁగ
మునిజనులాశీర్వదింప భూసుతకును భూపతికిని ||మంగళంబు||
సప్తఋషులుతనుచుట్టును స్వస్తివచనములనుజదువ
గుప్తచరితయగుజనకజ కునునూర్మిళదేవికి జయ ||మంగళంబు||
నారదతుంబురవీణా నాదమువినిమోదించుచు
ధారుణినరసాంబనేలు మారాజ్ఞికిరాజునకగు ||మంగళంబు||

### కీర్తన ఆదితాళము కమాస్.

మంగళముమనమాధవురాణికిని అంగజజననికినంబుజపాణికి

||మంగ||

ఇందుసమవదన కుందనిభరదనముకుందరాణినీదు
మందగమనమింపొందెడు పదారవిందమ్ములకిదె వందనంబు

జయ ||మంగ||

ఇందిరభీష్మక నందనసురముని వందితగుణశాలి
నందనందనుని డెందమునెపుడానందమునొందించు సుందరి

నీకు శుభ ||మంగ||

కోరినవారలకోర్కెలొసఁగెడి కొమ్మా! లోకజననీ

సారెకు వేఁడునరసాంబకుఁబ్రోవుము పారసనేత్రుని సఖియతోనీకు
జయ ॥మం౦గ॥

ఆదితాళము సౌరాష్ట్రి.

కౌసల్యాసుతునకెప్పుడు గల్గుజయమంగళం
వసుధబ్రాహ్మణులుగొల్చు వారిజాంఘ్రులుగల ॥కౌసల్య॥
శివునిచాపంబువిఱిచి సీతంబెండ్లాడినట్టి ॥కౌసల్య॥
సనకాదిమానిముఖ్య సదయాత్ములనుబ్రోచు ॥కౌసల్య॥
నరసాంబకొలుచునట్టి నారాయణుండయిన ॥కౌసల్య॥

కీర్తన ఆదితాళము.

కర్పూరహారతిదే కమలనేత్రకరుణానిధే
కరిరాజపోషనా కష్టములెల్లనీ కర్పుణచేసెద సర్వశయానుఁడ
॥కర్పూర॥
ముత్యాలహారతిదే మురహరసుగుణానిధే
మత్స్యమవైమున్ను బ్రమచ్చునుదునుమాడి నిత్యమాశ్రుతుల
జానకిచ్చినహరినీకు ॥ముత్యాల॥
మంగళహారతిదే మదనజనకమందరధరా
గంగాధరార్చిత శృంగారమూర్తినీ రంగగుపదములకు పొంగు
చునిరతము ॥మంగళ॥
నవరత్నహారతిదే నరసాంబఁబ్రోవబిరుదిదే
నవనీతచోరుఁడ నందకుమారుఁడ నగరాజధీరుఁడ నారదవం
ద్యనవ ॥రత్నాలహారతిదే॥

కీర్తన—ఏక. (మంగళమని మంగళమనరే)

నిగమగోచరా శ్రీరామనీకు మంగళం
సుగుణమణిజనకజనీకు శుభమంగళం ॥నిగమ॥

సర్వపరిపూర్ణనీకు సతతమంగళం
నిర్వికల్పనిలయనీకు నిత్యమంగళం ॥నిగమ॥

పంకజాక్షపద్మనేత్ర పరఁగుమంగళం
పంకజాసనాదివినుత పరమమంగళం ॥నిగమ॥

నారదసనకాదివినుత నవ్యమంగళం
శౌరినరసమాంబవిహిత హారిమంగళం ॥నిగమ॥

లాలిపాట ఆనందభైరవి చాపు.

లాలివసుదేవబాలా యదువంశ శీలసుగుణాలవాలా
లాలిపశుబృందపాలా భక్తజన లోలనిదురింపవేలా ॥లాలి॥

ధరణిభారముదలంచి దేవకీ తరుణిసుతుఁడై జనించి
వరలిపూతననుద్రుంచి మఱిత్రృణావర్తశకటులనునొంచి ॥లాలి॥

చల్లచట్లనుగొట్టఁగానినుగొంచుఁదల్లి రోటనుగట్టఁగా
మద్దులనుబడఁగొట్టఁగా నినుభువి ప్రసిద్ధుఁడని మొఱపెట్టఁగా
॥లాలి॥

సామజమునువమడంచి చాణూరుఁజంపి ముష్టికునిద్రుంచి
మామకంసునివధించి మహిని రుక్మిణి వధూమణివరించి ॥లాలి॥

గోవర్ధనోద్ధారుఁడై భక్తులకుఁ గోర్కులనొసంగుమీఁద
శ్రీవెలయగుండ్లపల్లె వాసుఁడై చెలఁగునరసాంబవినుతా॥లాలి॥

జోలపాట అటతాళము.

జోజోరాజదేవేంద్ర జోదయాసాంద్రా
జోరవికులచంద్ర జో రామచంద్రా ॥జోజో॥

కౌసల్యావరపుత్ర కపిరాజమిత్రా
పవమానసుతస్తోత్ర పావనచరిత్రా ॥జోజో॥

చంద్రభాస్కరనేత్ర శ్యామలగాత్ర
ఇంద్రాదినుతిపాత్ర యినకులపవిత్ర ॥జోజో॥

సురరాజరక్ష అసురరాజశిక్ష
నరసాంబరక్ష శ్రీవరమానిపక్ష ॥జోజో॥

మేలుకొలుపు అటతాళము భూపాలము.

మేలుకొనరా మేఘవర్ణుఁడ మేలుకొనరా మేరుధీరుఁడ
మేలుకొనరాముజ్జగంబుల నేలుకొనవలెరా వరదా ॥మేలు॥

తెల్లవారెను నెల్లభక్తులు దిక్కుగానక వగచుచుండిరి
పల్లవాధరయెల్లజనులను పాలనము సేయ-వరదా ॥మేలు॥

వందిమాగధబృందమెల్లను వచ్చినిన్ను నుతింపుచుండఁగ
నిందిరాహృదయేశ మేల్కొనవే యమరపాలా-వరదా ॥మేలు॥

ధరణిలో శ్రీవళ్ళివేదు సుధామరమ్మనిపిలుచుచుండెడి
నరసమాంబ మొఱల్ వినఁగ శ్రీనాథ మేల్కొ-నరా-వరదా
॥మేలుకొనరా మేఘవర్ణుఁడ॥

సంపూర్ణము.

శ్రీకృష్ణార్పణమస్తు.

శ్రీ శ్రీ శ్రీ

తే-గీ॥ అబలనగుట విజ్ఞానశూ న్యనగుటయును
దప్పులున్న మన్నింపుఁడు-ధర్మహితులు
ధరణినీకృతిచిరముగ-వఱలుగాత
వరదుకరుణనుగొని-

ఇట్లు,
నరసమాంబ.

విక్టోరియా జూబిలీ ముద్రాక్షరశాల, చిత్తూరు:-1931.